R. S.

రాధాస్వామినేనమః

# ఆంధ్రకృత భగవద్గీత




గ్రంథకర్త

ఉభయభాషాప్రవీణ

## మావుడూరి సత్యనారాయణశాస్త్రి

ఆంధ్ర సంస్కృత ప్రధానోపాధ్యాయుఁడు

బోర్డు ఉన్నత పాఠశాల, గురండి

గంజాం జిల్లా. (ఒరిస్సా)





నరసాపురము

కమలకుటీర్ (పవర్) ప్రెస్ లో

ముద్రింపఁబడినది.

1958




[వెల రు. 2-0-0



# కృతిసమర్పణము

మురళి చక్కఁగా మ్రోయించి పుడమి జనుల
సంతతానందవార్ధిలోఁ జక్కఁదేల్చి
భవ మనెడి వార్ధి దాటించి భవ్యమైన
మోక్షసామ్రాజ్య మొసగెడు మోహనాంగుఁ
డైన శ్రీకృష్ణమూర్తికిఁ నధికభక్తి
తోడ, నీ కృతి నర్పించుఁవాఁడ నేను॥

# గురుస్మరణ

శ్లో॥ సౌవర్ణాచలకాంతిపూర సదృశస్వాకార సంశోభితం
సత్సంగామృత పూరవాహిక మనంతానంద సంప్రత్ప్రదం
నానాయోగిభిరప్యదృశ్యవిభవం రాజీవపత్రేక్షణం
రాధాస్వామినమేవసద్గురు మహం స్వాంతే భజామీశ్వరం॥



శ్రీ. శ్రీ. మావుమారి జానికమ్మ

( గ్రంథకర్త సతీమణి )

జననము 1923  మరణము 28-6-'57

# విన్నపము

పాఠకమహాశయులారా!

భగవద్గీత యనునది మిగుల యుత్కృష్టగ్రంథ మనుటలో సందియము లేదు. ఈ గ్రంథము భిన్నభిన్నదేశములలో భిన్నభిన్న భాషలలోఁ బండితులును, భక్తులును, ననువదించియున్నారు. ఎవ రెన్ని విధములుగ భాషాంతరీకరించినను, భక్తిముక్తిప్రదమగు నీ గ్రంథము పాఠకులకు విసుగు చెందనీయ దనుటలో సందేహ మిసుమంతయును లేదు.

విషాదపరీతహృదయుఁడగు నర్జునునకు శ్రీకృష్ణభగవానుఁ డుపదేశించిన దీ గ్రంథము. అస్త్రములు విడచి, రథముపైఁ గూలపడి, జ్ఞాతివధ పాతకమని తలఁచి, చింతించుచున్న యర్జునునకు భక్తిజ్ఞానవైరాగ్యాదుల నుపదేశించి, యుద్ధమున కుత్సాహవంతునిగాఁ జేయుట యిందలి ముఖ్య విషయము.

ప్రతిదిన మీ గీత యొకటి రెండధ్యాయముల చొప్పున పారాయణ చేయుట నా నిత్యకృత్యము. కార్తికశుద్ధ యేకాదశీ దినమున యథారీతి పారాయణము చేయుచుండగా "ఏల యిట్లు వృథాగా పారాయణ చేయుచుందువు. ఈ గ్రంథము బద్యరూపమున ననువదించగూడదా?" అని భగవత్ప్రేరణ నా హృదయములోఁ గలిగినది. పిమ్మట యీ గ్రంథము ననువదించుట కారంభించితిని.

కొందఱీ గీతను భిన్నవృత్తములతోను, వేరువేరు పద్యములలోను, ననువదించియున్నారు. కాని గీతను గీతములలోనే యనువదించుట నా ముఖ్యోద్దేశము. అనఁగా శ్లోకమున కొక పద్యము చొప్పున 700 శ్లోకములకు 700 పద్యములు వ్రాసియున్నాను. సాధ్యమైనంతవఱకు మూలాభిప్రాయమును గీత నాలుగుచరణములలోనే వ్రాసితిని. కాని మూలాభిప్రాయము నాలుగు చరణములలో నిముడ నవకాశములేని స్థలములలో గీతి పద్య మైదాఱు చరణములలోఁ గూడ వ్రాసితిని. ఇట్లు వ్రాయుట లక్షణ విరుద్ధముకాదు. దీనిని పాఠకు లన్యథా భావింపరని నాయుద్దేశము.

ఇందు వ్యాకరణవిషయకదోషములుగాని, ఛందోవిషయక దోషములుగాని, ప్రమాదవశమున నుండిన నుండవచ్చును, సహృదయు లట్టి దోషములను నాకుఁ దెల్పినచో ద్వితీయ ముద్రణమున సవరించుకొందును.

"కలౌతుస్మరణాన్ముక్తిః" అను నార్యోక్తి ననుసరించి కలియుగమున స్మరణకంటెమించినది ప్రపంచమున వేరొకటిలేదు. కలియుగమున భవసాగరమునుండి తరింపఁజేయుటకు భగవన్నామమొక తరణివంటిది. పాపజాలమును పారదోలి ముక్తి నధిరోహించుటకు నామము నిశ్రేణివంటిది. ప్రాచీన కాలమున నీ నామజపము చేసియే ఋషులు మొదలగువారు మోక్షమును జెందియున్నారు. కాన భక్తమహాశయు లీ గ్రంథమును పఠించి తల్లాభమును బొందుదురు గాక.

గీతానువాద సందర్భమున నన్ను అన్నివిధముల ప్రోత్సహించి, పతివ్రతాధర్మమును పాటించి, సర్వదా గీతాపఠనముచేయుచు, సద్గురునామమగు, రాధాస్వామీ నామమును స్మరించుచు, భౌతికదేహమును జాలించి, కీర్తిశేషురాలైన, నా సహధర్మచారిణి యగు జానకమ్మ ఆత్మకు శ్రీకృష్ణభగవానుఁడును, శ్రీసంతసద్గురువును శాంతి చేకూర్తురుగాక!

ఈ గ్రంథము నచ్చొత్తించు సందర్భమున ధనసహాయ మొనర్చిన మహాశయులకు శ్రీహరి యన్నివిధముల తోడ్పడుగాక. మఱియు నీ సందర్భమున నన్నేకవిధముల ప్రోత్సహించి, వారి వారి యభిప్రాయముల నొసంగిన పండితులకును, కవులకును, నా ధన్యవాదములు. ముద్రణ విషయములో నేవిధములగు దోషములు లేక చక్కఁగా ముద్రించి సకాలములోఁ బుస్తకములను నా కందజేసిన శ్రీ వంగూరి నరసింహారావుగారికి నా ధన్యవాదములు!

ఆబాల్యమునుండి కవీశ్వరులును, మన్మిత్రులును, నగు శ్రీ బంకుపల్లె కనకాచలము భాగవతారుగారు నాకుఁ దీరికలేకపోవుటచే "గీతామాహాత్మ్యము"ను అనువదించి నా కొసంగినందులకు వారి కెంతయును నా ధన్యవాదములు!!

గ్రంథకర్త

# పరిచయము

గీ॥ కశ్యపుని గోత్రమందున ఘనతఁగాంచి
యధిక కీర్తిని బొందిన యమలచరితుఁ
డైన మామకపితరుని ననుదినంబు
సూరిఁ జాయన్న వంశాబ్ధిసోము నెపుడు

గీ॥ భర్తృవశవర్తిని యగుచుఁ బరగునట్టి
లక్ష్మికిని నద్దియగు మహాలక్ష్మి జననిఁ
జిత్తమునఁ దలఁచి మత్కార్యసిద్ధిఁ గోరు
వందనముఁ జేతు వారికి ముందుగాను॥

గీ॥ వైద్యశాస్త్రాన విఖ్యాతి వసుధయందు
బడసి కీర్తినిఁ గాంచిన పరమశాంతు
సోదరు జగన్నాథుని సాదరమునఁ
జిత్తమునఁ దలంచెద కార్యసిద్ధిఁ గోరు॥

గీ॥ పరమపురుషుని ప్రేరణవలన నేను
సర్వజనులకుఁ దెలియంగ సంస్కృతంబు
నందు నున్నట్టి యీ గీత యాంధ్రమునకు
ననువదించితి, నీ గీత నధికప్రీతిఁ
బఠన పాఠనముం జేయు భక్తులకును

గీ॥ విగతకల్మషుఁడైనట్టి విష్ణు వెపుడు
ఆయురారోగ్యసంపద లధికముగను
నొసఁగి భవసాగరమునుండి యొడ్డు చేర్చి
మోక్షమును గూడ నొసగుతఁ బుడమియందు॥

గ్రంథకర్త

# అమూల్యాభిప్రాయములు

---

## ROKKAM LAKSHMI NARASIMHAM

*B. A., B. L., M. L. A.*

శ్రీకాకుళం.

బ్ర॥ శ్రీ॥ మావుడూరి సత్యనారాయణ శాస్త్రిగారు తాము తెనిగించిన భగవద్గీతలోని కొన్ని పద్యములు జదువగావిన్నాను. చక్కని శైలిలో సామాన్యజనులకు గూడ సుబోధకమగు రీతిని ఉత్తమ తత్వగ్రంథమును తెనిగించి తరించినారు. భక్తిముక్తిప్రదమగు నీ గ్రంథమును పండిత పామరజనులు పఠించి తరింతురుగాక.

రొక్కం లక్ష్మీనరసింహము.
13—6—57

కె. జోగయ్యశర్మ

ఆంధ్రవిశ్వకలాపరిషత్
వాల్తేరు.

ఆర్యమిత్రులు మావుడూరి సత్యనారాయణ శాస్త్రిగారు ఆంధ్రీకరించిన భగవద్గీతలోని పద్యములను చాలవఱకు జదివితిని. నేనుజూచినంతవఱకు వీరియాంధ్రీకరణము సరళముగను నిర్దుష్టముగను, మూలభావస్ఫోరకముగను, గన్పట్టునది. పెద్దపెద్ద వృత్తముల పొంతఁబోక చిన్నచిన్నఛందములలో రచన సాగించుట ఆనందింపఁదగినవిషయము. అవగాహన చేసికొనుటకును వీలగును. సహృదయులగు పాఠకులు వీరిరచనయందలి నీహారలేశములను లెక్కింపక మంచినే గ్రహింతురనియు, మిత్రశ్రీ సత్యనారాయణ శాస్త్రిగారితోధికముగా సారస్వతసేవచేయుదురనియు ఆశించుచున్నాను.

కె. జోగయ్యశర్మ.
19—6—55

శ్రీరస్తు: ఓంనమః

# కృతిప్రశంస

ఉ. శ్రీయుత మావుడూరికుల సింధుసుధాకరుఁడైన సత్యనా
రాయణశాస్త్రి యాంధ్రమున వ్రాసిన గీత 'వసుంధరన్' మహా
ప్యాయముతోఁ బఠించి, కడు హర్షమునొందితి, నెవ్వరేనియున్
హాయి దెలుంగువీణియ హుటాహుటి బాడిన సొంపు నింపదే|| 1

మ. తెలుఁగున్నేముఁడు తిక్కయజ్వ భగవద్గీతన్ మదిన్గొంచెపున్
దలపుల్ దానెవొ పొందియుండె నని నింద ల్వాల్కగాఁ జెల్లునే
కళ నర్చించు మహామహుం డుపనిషత్కాండోపదేశమ్ము ను
త్కలికన్ జేసెనుగాదె తచ్చరణపద్మశ్రీ జగమ్మొమ్ముతన్|| 2

గీ|| తడవు తడవకు సత్యమ్ము నుడువునడపు
పొడముచుండును గాదె యబ్బురపుగాంతి
ప్రావృడబ్దంబు మర్దలార్భటుల నించి
మెరపుగీతల లాస్యమ్ము నెరపకున్నె|| 3

ఉ. శ్రేయ మొసంగు గీతల విశేషమెరుంగఁగఁ జాలరు సూర్యనా
రాయణుఁ డన్నరున్ మిషగనందినయట్టి జగద్గురుండు నా
రాయణుఁ డల్ల శంకరుఁడు నమ్మహితాఢ్యుఁడైన సత్యనా
రాయణశాస్త్రి నేటికిటు లాంధ్రమునన్ రచియించి మించెడున్ 4

శా. గీతాశాస్త్రము సాహితీజగతి నుత్కృష్టప్రభావాన్వితం
బేతద్గ్రంధము దెల్లజేసితివి నీ వింపార గీతాలలో
గీతింపందగు నీదు నుద్యమము శ్రీకృష్ణుండు నీకిచ్చు న
ద్వైతానందము మావుడూరికులదీపా! సత్యనారాయణా! 5

ఇట్లు, హితాభిలాషి

కసిమికోట
1-7-1957

వడ్డాది సీతారామాంజనేయకవి,
ఉభయభాషాప్రవీణ, స్వరాజ్యకవి, అష్టావధాని.

గ్రంథకర్తలు శ్రీమావుఫూరి సత్యనారాయణశాస్త్రిగారిచే
వ్రాయబడిన శ్రీభగవద్గీతానువాదగీతములకు

సదాశయాభిప్రాయము

గీ. గీతలను గీతపద్యాల రీతిఁ గూర్చి
హితవుఁ గనఁజేసి బుధులు సంతతము పొగడ
వరలినాడవు పండిత ప్రతిభ మించి
సత్యనారాయణాభిధా శాస్త్రివర్య!

అనేకులు గీతల ననువదించిరి. కాని వానిలోనెల్ల మిన్నయనందగు నీ పద్యములఁ గాంచి సంతసించితిని. ఇంకను నిట్టి మహత్తరగ్రంథములను, సరియగురీతి ననువదించి కీర్తిగొన మిమ్ములను శ్రీ సత్యనారాయణప్రభుఁ డాశీర్వదించుగాక.

ఇట్లు
పతి సూర్యనారాయణమూర్తికవి.
కసిమికోట. 20-6-57

ఓం నమోనారాయణాయ, శ్రీమతేరామానుజాయ నమః

ఉభయభాషా ప్రవీణులగు బ్ర॥ శ్రీ మావుఫూరి సత్యనారాయణశాస్త్రిగారిచే రచింపబడిన శ్రీ భగవద్గీతాంధ్రానువాదము నే జదివితిని. ఆంధ్రీకృత పద్ధతి చక్కని సులభ శైలిలో గలదు. పండిత పామర జనులకు ఆనందము కలుగజేయుచున్న దనుటలో సందేహము లేదు. వీరి యనువాదము మూలమునకు సరిగా నున్నది. కవిత్వము ద్రాక్షాపాకభరితమై ఎల్లరకు తేటతెల్లముగ బోధపడుచున్నది. ఈ గ్రంథము సర్వజనోపకారకము కాగలదని నా దృఢవిశ్వాసము. శ్రీశాస్త్రిగారికి లక్ష్మీనాథుడు అన్ని విధములుగా తోడ్పడుగాక.

కశింగోట
విశాఖ జిల్లా
20-6-1957

ఇట్లు
రేజేటి అప్పలాచార్యులు
ఆగమపండిట్, ఉభయవైద్య ప్రవీణ.

ఓం నమోభగవతే శ్రీరమణాయ

సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ, కవిశేఖర,

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

పండితుఁడు, ప్రభుత్వమహారాజ సంస్కృత కళాశాల, విజయనగరము.

ప్రియమిత్రులు, సహపాఠులు, ఉభయభాషాప్రవీణులు, బ్రహ్మశ్రీ మాపుదూరి సత్యనారాయణశాస్త్రిగారు "ఆంధ్రీకృతభగవద్గీత" అను నామమునుంచి, ఆంధ్రీకరించిన శ్రీగీతానువాదము నందలి కొన్ని భాగములను చదివి యానందించితిని.

శ్రీ శాస్త్రిగారు జనసామాన్యమును, దృష్టియందుంచుకొని, సులభసరళలలిత మగు శైలిలో - ఈ పవిత్ర గ్రంథము నాంధ్రీకరించిరి. చాలవఱకు మూలము ననుసరించి యున్నారు.

కర్మ, భక్తి, జ్ఞానయోగములను సమన్వయించిన గ్రంథము భగవద్గీత కంటె, భిన్నమగున దింకొకటి లేదు. కావున నిది కర్ములకు, భక్తులకు, జ్ఞానులకు, యోగులకు, ఉపాదేయమును, విజ్ఞేయమును, నగుచున్నది. ఆంధ్ర భాషయందు స్వల్పమగు పరిచయము గల వారికిఁ గూడ వీరి యాంధ్రీకృతి సులభావబోధమై యున్నది.

అధ్యాత్మ విద్యను ప్రబోధించునదియు, ప్రపంచ ప్రసిద్ధమును, అజ్ఞాన వినాశకమును, అగు భగవద్గీత యొక్క మహత్త్వము వర్ణనాతీతమై యున్నది.

సంస్కృత భాషాజ్ఞానము లేని జిజ్ఞాసువులగు అధ్యాత్మ విద్యాపరాయణుల కీ శాస్త్రిగారి గ్రంథము మిక్కిలి యుపకరించుననుట సత్యేతరము కాఁజాలదు. ఇట్టి సద్గ్రంథము నాంధ్రీకరించిన యీసన్మిత్రు నభినందించుచు, ఇట్టి సద్గ్రంథములను రచించుటకుఁదగిన ఆయురారోగ్య విజ్ఞానసంపద ననుగ్రహించి భగవంతుఁడీయనను రక్షించుగాతమని ఆభగవానుని ప్రార్థింతును.

ఇట్లు, సజ్జన విధేయుఁడు

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

19—6—57

B. CHANDRASEKHARA RAO, B. A. B. Ed.
*HEADMASTER,*
B. H. School, Kotabommali,
*Srikakulam Dist.*

It gave me great pleasure to go through the book "Andhreekruta Bhagavadgeeta" by Brahmasree M. Satyanarayana Sastry Garu, "Ubhaya Bhasha Praveena" an experienced Pandit of Sanskrit and Telugu languages in the service of the Ganjam District Board. The translation was done in such a nice manner that it is within the comprehension and reach of all people that can read the Telugu language. His enterprise is really commendable and I wish him all success in his attempts.

*Sd. B. Chandrasekhara Rao,*
*12—6—57*

శ్రీ M. సత్యనారాయణశాస్త్రిగారు చేసిన గీతానువాదమును జదివి చాల ఆనందించితిని. అనేక విధములుగా నీ గీతానువాదములున్నను పండిత పామర జన సుబోధకముగ వ్రాయఁబడినవి చాల తక్కువ. వీరి పరిశ్రమ సర్వజన సంప్రీతికరమగునని నాయూహ. నేను మాత్ర మింత సరళముగ గీతను ననువదించుటను గూర్చి చాల సంతోషించితిని. అందరకు సులభగ్రాహ్యమగుటయే శ్రీ శాస్త్రిగారి యభిమతమని తెలియనగును.

పర్లాకిమిడి
16-5-57

ఉభయభాషాప్రవీణ
పి. వి. బాలకృష్ణమూర్తి శాస్త్రి
(M. R. B. H. School)

శ్రీమావుడూరి సత్యనారాయణశాస్త్రిగారు రచించిన ఆంధ్రగీతను స్థాలీపులాకన్యాయముగాఁ జూచితిని. వీరు కొన్నిస్థలములలో కేవల మూలమును, కొన్నిస్థలములలో శంకరభాష్యమును అనుసరించి వ్రాసిరి. భాష మృదుమధుర గంభీరముగా నున్నది. గీతను గీతలలోనే రచియించుట శ్లాఘనీయము. వీరిట్టితరకృతులను గూడ అనుకూలవృత్తములలో రచించి ఆంధ్రుల మన్నలను పొందుదురుగాక.

విశాఖపట్టణము 19—6—55

కొల్లూరు మహాదేవశర్మ.
సాహిత్యవిద్యాప్రవీణ, సంస్కృతోపాధ్యాయుఁడు
మ్యునిసిపాల్ హైస్కూలు.

## పండితాభిప్రాయము

బ్రహ్మశ్రీ మావుడూరి సత్యనారాయణశాస్త్రి వ్రాసిన గ్రంథమును కొంచెము మాత్రము వింటిని. ఇతని హృదయము సాత్వికము. రచన ఆధ్యాత్మికము. నేటి కాలమున, శ్రీకృష్ణభగవానుని యుపదేశమగు గీతలు లోకమున కెంతయు నభిరుచి గలవై ప్రచారమునఁ బ్రతి గృహమునందును, బ్రతి వ్యక్తి హస్తముల యందును, గానవచ్చుచున్నవి. భగవద్గీతల నాంధ్రీకరించుటయు, నందును బద్యమయముగా రచియించుట దుర్ఘటము కాక పోదు. అయినను, శ్రీకృష్ణభగవానుని యెడఁ గల యీతని భక్తి యీతని కిట్టి సాహసోత్సాహములు కలిగించినవి. ఇది సామాన్యులగు నాధ్యాత్మిక పరులకెల్ల మిక్కిలి యుపయోగించునది. ఇట్టి గ్రంథములలో, ఛందోలక్షణాంశ విమర్శలకుఁ దావంగుట అనూయామూలకము. ఇట్టి వానిని మఱియు వ్రాయుటకుఁ బాఠకులు ప్రోత్సహింతురు గాక. భగవానుఁ డారోగ్యము ప్రసాదించుగాక.

అకుండి వెంకటశాస్త్రి

## శ్రీ, మావుడూరు సత్యనారాయణశాస్త్రిగారికి

మ హా శ యా !

ఉ॥ వ్యాసుడు సంస్కృతంబునను వ్రాసిన గీతలు మీరు తెన్గులో
భాసుర మొప్ప నోపికను వ్రాసిరి పూర్తిగ గీతపద్యసం
కాశముగా, సెబాసన నఖండయశంబుఁ గడించినారు, వి
శ్వేశుఁడు మీ కొసంగుత విశేషసుఖంబు చిరాయురున్నతుల్॥

సీ॥ ఉభయభాషాజ్ఞాన విభవంబు గల్గిన
సార్థకంబొకవంకఁ జాటుచుండె
శ్రీమావుడూరు వంశీయు లెల్లరకిని
నొక భూషణంబయి యొప్పుచుండె
అమలమౌకూర్పు నాధ్యాత్మికశక్తియు
తేటతెల్లంబుగాఁ దెల్పుచుండె.
కవితావధూటికిఁ గాంచనాలంకార
మిడె నీతఁ డని లోక మెంచుచుండె
మీరువ్రాసిన పొత్తము మీకులంబు
నకును విద్యకు భువిలోన నంత యశము
గూర్చుచున్నది మిక్కిలి కొమరు మిగిలి
జగతి సత్యనారాయణశాస్త్రివర్య!

ఉ॥ వ్రాయఁగ నేర్చినారు కవులైనవలల్ భువిగాని మీవలెన్
వ్రాయఁగఁ బూనరైరి హపరంబుల శాశ్వతకీర్తి ముఖ్యులన్
ప్రాయికి మెప్పుఁ బొందఁదగు వ్రాతలు నేడొకరైన సత్యనా
రాయణశాస్త్రి! యిట్టి చతురత్వ మదెల్లరికిన్ లభించునే?"

కామధేనువు
పర్లాకిమిడితాలూకా,
1—6—57

ఇట్లు
బంకుపల్లి కనకాచలం
కవి & భాగవతార్.

ఓం

నా సహోపాధ్యాయులు ఉభయభాషాప్రవీణులునగు బ్రహ్మశ్రీ మోపుదూరు సత్యనారాయణశాస్త్రిగారు రచించిన 'యాంధ్ర భగవద్గీతను నే నామూలాగ్రముగాఁ జూచితిని. భగవద్గీత మానవులకు భక్తిముక్తిప్రద మనియు, భారతీయ విజ్ఞానమునకు మూలకందమనియు దాన భారతదేశమున కెడతెగని గౌరవము కీర్తి లభించినదని వేఱె నుడువనక్కఱలేదు.

సంస్కృతభాషలోనున్న భగవద్గీత సర్వజన సామాన్యమున కందుబాటులో నుండదను నుద్దేశముతో నాంధ్రజనుల కుపకారము చేయనెంచి, కొందరు పాటల రూపముగను, కొందఱు వచన రూపముగను, కొందఱు పద్యముల రూపముగను తెనుఁగులోని కనువదించిరి.

శ్రీ శాస్త్రిగారికి బాల్యమునుండి భగవద్గీత యందు మక్కువ యెక్కువ. దానికి తోడు సాహిత్యసంపద, సదాచారసంపన్నత్వము దైవేచ్ఛచే లభ్యమైనవై వీరి నీ కవితాకృషికి పురికొల్పినవి. భగవద్గీతావ్యాఖ్యలలో ముఖ్యమగు శంకరభాష్యము నాధారముగాఁ గొని భగవద్గీతల గీతపద్యములలోనే రచింప సంకల్పించి పదునెనిమిది యధ్యాయములను తేట తెనుఁగు బాసలో ననువదించిరి. వీరి రచన నిర్దుష్టము, నాతిక్లిష్టము, మృదుమధురమై యలరారుచున్నది. ఇఁక కవిత్వఛందోవిషయములు పరిశీలించుట యనవసరము. సంస్కృత భగవద్గీతను తెనుఁగు గీతములలో రచించి యాంధ్రభాషామతల్లికి నొక నూత్న యాభరణము నొసగిన శ్రీ శాస్త్రిగారి కవితాకృషి యెంతయో ప్రశంసనీయము.

శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతల వలె వీరి గీతములను గూడ జగద్గీతలఁగా నొనరించి, యిట్టి సుకృతులను రచింప శక్తిని దీర్ఘాయువు నొసంగి శ్రీ శాస్త్రిగారిని రక్షించుఁగాత యని నా యభీష్టము.

ఇట్లు, బుధజనవిధేయుఁడు
సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ
కట్టమూరి లక్ష్మీనారాయణకొండలరావు
తెలుగు పండితుఁడు, బోర్డుహైస్కూలు.

గురండి
గంజాం జిల్లా
29-6-57

మహారాజశ్రీ మావుదూరి సత్యనారాయణశాస్త్రిగారు వ్రాసిన గీతాభాషాంతరీకరణమును వారు నాకడఁజదువఁగాఁ గొన్నిపట్టులు వింటిని. వీరు గీర్వాణాంధ్రముల యందుఁ బరినిష్ఠిత పాండిత్యము గల్గియుండుటయేకాక కవితా విద్యయందున వేదాంత పరిజ్ఞానమునను బరిచయముగలవారగుటచే గీతా శ్లోకములను గీత పద్యములలో వ్రాసిరి. గీతలను గీతపద్య రూపమున వ్రాయుట యెంతయు సముచితము. గీతాపాఠకులు వీరి యనువాదము సాయమున సంస్కృత పాండిత్యము చాలని లోపము ననుభవింపక సంస్కృత పండితుల వలెనే గీతలనలవరచుకొనఁ గలరని నావిశ్వాసము. సర్వమానవలోకము దీనింబఠించి తరింతురుగాక యని యాకాంక్షించుచున్నాను.

ఇట్లు బుధజన విధేయుఁడు
ఆకెళ్ళ అరుణాచలశాస్త్రి
సీనియరు తెలుఁగు పండితుఁడు
మహారాజా గవర్నమెంటు సంస్కృత కళాశాల

19-6-57
విజయనగరము

ఓం.

బ్రహ్మశ్రీ ఉభయభాషాప్రవీణ, మావుదూరి సత్యనారాయణశాస్త్రిగారి గీతానువాదమును నేఁ జదివి సంతసించితిని. భగవద్గీతానువాదము లసంఖ్యాకములుగా నున్నను, సరళాంధ్ర గీతికలలో ననువాద మొనర్చిన శ్రీ సత్యనారాయణశాస్త్రిగారి పరిశ్రమ ప్రశంసనీయము. గీతామృతమునుఁ గ్రోలఁదలఁచిన యాంధ్ర సోదర సోదరీమణులకీ యాంధ్రీకృత భగవద్గీత యెంతయు నుపకరించును. ఇట్టి కృతుల వెలయించి శ్రీ మావుదూరి సత్యనారాయణశాస్త్రిగా రాంధ్రుల మన్ననల నందగలరని నా విశ్వాసము.

కోవిద, సాహిత్యవిద్యాప్రవీణ
భళ్ళమూడి సీతారామమూర్తి.
(పండితుడు) M. R. B. High School

పర్లాకిమిడి
గంజాంజిల్లా
16-5-57

బ్రహ్మశ్రీ మావుడూరు సత్యనారాయణ శాస్త్రులుగారు ఛందోబద్ధముగా ననువదించిన గీతాశాస్త్రమును ఇంచుమించు పూర్తిగా నేను పరికించితిని. పండితులు పామరులు గూడ ఇందలి యభిప్రాయములను చక్కగా తెలిసికొనుటకున్ను, ఆత్మవిద్యావంతులగుటకున్ను, అవకాశము కలదని మనవి చేయుచున్నాను. గీతా శాస్త్రమందలి భావములిందు యథాతథముగా పొందుపరుపబడినవి.

ఇట్లు
ముట్నూరు అనంతశర్మ
వ్యాకరణవిద్యాప్రవీణ
గ్రేడ్ I సంస్కృత పండితుడు.

బోర్డుహైస్కూలు
రాజాం
19—6—57

శ్రీః

శ్రీయుత మావుడూరి సత్యనారాయణశాస్త్రిగారిచే నాంధ్రీకరింపఁబడిన భగవద్గీతను, నేను స్థాలీపులాకన్యాయముగాఁ బఠించితిని. ఇతః పూర్వము భగవద్గీతకు వ్యాఖ్యలు వ్రాయుట అనువాదము చేయుట పలువురు జేసి యున్నారు. కాని శాస్త్రిగారి అనువాదము మృదుమధురశైలితోఁ గూడి పండితపామరపఠన యోగ్యముగా నున్నవి. మూలశ్లోకములను ఆంధ్రములోని కనువదించునపుడు పలువు రనేక వృత్తములలో వ్రాయగల్గిరి. కాని శాస్త్రిగారు మొదటనుండి చివరవరకు గీతపద్యములలోనే వ్రాయుట కడు ప్రశంసనీయము. సంస్కృతజ్ఞాన విహీనులకుఁ గూడ భగవద్గీతను పఠన యోగ్య మొనర్చిన వీరి కృషి కడుశ్లాఘనీయము. కాబట్టి శాస్త్రిగారు భక్తియుక్తులగు నిట్టి పొత్తములను రచించి భగవత్కృపను బడయుచురుగాక.

ఇట్లు
మరువాడ ముఖలింగశాస్త్రి
మహారాజావారి బాలకోన్నత పాఠశాల
ప్రధానోపాధ్యాయుడు.

పర్లాకిమిడి
గంజాంజిల్లా
16-5-57

# రాజపోషకులు

| పేరు, గ్రామనామము | చందా విషయము |
| --- | --- |
| మ.రా.శ్రీ పెద్దిని రామలింగసుబుద్ధివారి పుత్రులు, గారబంద | 58-0-0 |
| ,, బంకుపల్లి సత్యనారాయణగారు, బుసికిడి | 25-0-0 |
| ,, సుసరాపు సుబ్రహ్మణ్యంగారు, కోటబొమ్మాళి | 20-0-0 |
| ,, కోట అంగదుడుగారు, అడబ | 20-0-0 |
| ,, పీసపాటి సత్యనారాయణ ఆచారిగారు, రాజీపేట | 20-0-0 |
| ,, దుంప జగన్నాథప్పడుగారు, ధర్మవరము | 20-0-0 |

## పోషకులు

| | |
| --- | --- |
| ,, పట్నాల రామమూర్తిపాత్రోగారు, అసికా | 15-0-0 |
| ,, బళ్ళ లచ్చన్ననాయుడుగారు, ఉప్పలాద | 15-0-0 |
| ,, రొత్తు చిన్నన్నాయుడుగారు, కత్తులకవిటి | 15-0-0 |
| ,, లాడి దాలెప్పన్నవారి సోదరులు, కోటబొమ్మాళి | 10-0-0 |
| ,, అల్లాన అప్పలస్వామిగారు, అడబ | 10-0-0 |
| ,, ధర్మాన శేరునాయుడుగారు, కొరసండ | 10-0-0 |
| ,, రొత్తు శంకునాయుడుగారు డిటో | 10-0-0 |
| ,, పల్లె శాంతయ్యగారు, బుసికిడి | 10-0-0 |
| ,, బాలె సింహాద్రినాయుడుగారు,డిటో | 10-0-0 |
| ,, బూర్లె జేజేలుగారు డిటో | 10-0-0 |
| ,, పి. బి. చంద్రశేఖరత్యాదీగారు, బాహుసళ | 10-0-0 |
| ,, పడాల గురివినాయడుగారు, సరియాపల్లి | 10-0-0 |
| ,, ఆసపాన దండాసినాయడుగారు డిటో | 10-0-0 |
| ,, ఉప్పపాల అప్పన్నదొరగారు వావిలపాడు | 10-0-0 |
| ,, శివాల కృష్ణమూర్తిగారు డిటో | 10-0-0 |
| ,, శివాల లక్ష్మినారాయణగారు, డిటో | 10-0-0 |
| ,, లోళ్ళ జగన్నాయకులునాయుడుగారు, దుగరాజుపేట | 10-0-0 |
| ,, కొల్లి చంద్రశేఖరంనాయుడుగారు, కంట్రగడ | 10-0-0 |

| | | | |
|---|---|---|---|
| శ్రీ | కిల్లంశెట్టి సాంబమూర్తిగారు, | చాపర | 10-0-0 |
| ,, | కందికుప్ప కామరాజు ఆచారిగారు | కంట్రగడ | 10-0-0 |
| ,, | మల్లారెడ్డి సత్యనారాయణదొరగారు, | గొప్పిలి | 10-0-0 |
| ,, | పడ్డ నారాయణగారు, | లక్ష్మీపురము | 10-0-0 |
| ,, | బైపోతు అప్పారావునాయుడుగారు | డిటో | 10-0-0 |
| ,, | అప్పన్న దాసునాయుడుగారు, | గారబంద | 10-0-0 |
| ,, | పడ్డ ఖగేశ్వరనాయుడుగారు, | పెద్దకొత్తూరు | 10-0-0 |
| ,, | శ్రీహరినాయకా, | జంగాలపాడు | 10-0-0 |
| ,, | కత్తి లక్ష్మణరావుగారు, | అంకుడం | 10-0-0 |
| ,, | గేదల రామమూర్తిగారు, | కత్తుకవిట | 10-0-0 |
| ,, | మావుడూరు చిన్నప్పన్నగారు, | బుసికిడి | 10-0-0 |
| ,, | లోళ్ళ రామమూర్తినాయుడుగారు, | లింగుపురం | 10-0-0 |
| ,, | గేదల అప్పారావునాయుడుగారు, | బాహుసళి | 10-0-0 |
| ,, | మాలుగు అప్పన్నగారు | డిటో | 10-0-0 |
| ,, | మామిడి రాజగోపాలనాయుడుగారు, | గలావెల్లి | 10-0-0 |
| ,, | గేదల అప్పలసూరప్పనాయుడుగారు, | ఉసుకూరు | 10-0-0 |
| ,, | దూబ సంగన్నాయుడుగారు, | కాగితాపల్లి | 10-0-0 |
| ,, | టంకాల బుచ్చన్నాయుడుగారు, | చిన్నశిర్లాం | 10-0-0 |
| ,, | టంకాల అప్పలనాయుడుగారు, | డిటో | 10-0-0 |
| ,, | కొల్లాన రామమూర్తిగారు, | గొప్పిలి | 8-0-0 |
| ,, | తరణి జన్నాగారు, | గురండి | 8-0-0 |

## ఉపపోషకులు

| | | | |
|---|---|---|---|
| శ్రీ | కలమట సారధిగారు, | బుసికిడి | 5-0-0 |
| ,, | కిల్లంశెట్టి అప్పన్నగారు, | గారబంద | 5-0-0 |
| ,, | ,, రాఘవులుగారు, | డిటో | 5-0-0 |
| ,, | ,, వాసుదేవంగారు, | డిటో | 5-0-0 |
| ,, | ,, సాంబమూర్తిగారు, | డిటో | 5-0-0 |
| ,, | ,, గణపతిరావుగారు, | డిటో | 5-0-0 |

| | | |
|---|---|---|
| శ్రీ సిందిరి జోగిసన్యాసిగారు | గారబంద | 5-0-0 |
| ,, జోన్న జనార్దననాయుడుగారు | గురండి | 5-0-0 |
| ,, ,, జగన్నాథంనాయుడుగారు | డిటో | 5-0-0 |
| ,, బెండి సూర్యనారాయణ ఆచారిగారు | డిటో | 5-0-0 |
| ,, రామచంద్రజన్నాగారు | డిటో | 5-0-0 |
| ,, తెంబూరు రామినాయుడుగారు | బుసికిడి | 5-0-0 |
| ,, ,, గద్దెన్నాయుడుగారు | డిటో | 5-0-0 |
| ,, కలమట లక్ష్మీనారాయణగారు, | డిటో | 5-0-0 |
| ,, కలమట కట్టెన్నగారు | డిటో | 5-0-0 |
| ,, సైలాడ రామన్నగారు | డిటో | 5-0-0 |
| ,, తెంబూరు చిన్నప్పన్నగారు | డిటో | 5-0-0 |
| ,, మల్లారెడ్డి ఆంజనేయులుదొరగారు, | గొప్పిలి | 5-0-0 |
| ,, నాగులపల్లి పొట్టెన్నగారు, | ఛత్రపురము | 5-0-0 |
| ,, పుష్పాల హరికృష్ణగారు, | వావిలపాడు | 5-0-0 |
| ,, నాగులపల్లి మాణిక్యంగారు, | కంట్రగడ | 5-0-0 |
| ,, పద్మపురపు సిమ్మన్నగారు, | అంపడు | 5-0-0 |
| ,, దువ్వాడ వెంకటాచార్యులుగారు | డిటో | 5-0-0 |
| ,, కోట కృష్ణారావుగారు, | అడబ | 5-0-0 |
| ,, మల్లపెద్ది లింగన్నగారు; | ఈప్పలాప | 5-0-0 |
| ,, గున్న సింహాద్రినాయుడుగారు, | డిటో | 5-0-0 |
| ,, పల్లె ఎండునాయుడుగారు, | సింగుపురం | 5-0-0 |
| ,, బోరెపు పాపారావుగారు, | డిటో | 5-0-0 |
| ,, బొబ్బిలి జగన్నాథంగారు, | డిటో | 5-0-0 |
| ,, కంచరాం నారాయణగారు, | తోటగుమడ | 5-0-0 |
| ,, పట్టికూళ్ళ బులుసునాయుడుగారు, | పెద్దజగన్నాథపురం | 5-0-0 |
| ,, తామరపల్లి హరికృష్ణగారు, | చిన్నకొత్తూరు | 5-0-0 |
| ,, యరగాన పాపయ్యనాయుడుగారు, | దోనూరు | 5-0-0 |

# ఆంధ్రీకృత భగవద్గీత

## ఒకటవ అధ్యాయము

## అర్జునవిషాదయోగము



ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ !

ధర్మమయమైన క్షేత్రమై దనరునట్టి
కురుధరణియందు యుద్ధముం గోరునట్టి
పాండవులు నాదు పుత్రులు పరగ నేమి
చేసి రద్దాని సంజయా ! చెప్పు మిపుడు 1

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్

ప్రోగుగా నిల్చు పాండవ వ్యూహములను
అపుడు దుర్యోధనుఁడు చూచి యట్టె నిలచి
బుద్ధితోఁచక యాచార్యు నొద్ద కేఁగి
పల్కె నీరీతి సారమౌ వాక్యములను 2

పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య! మహతీంచమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా.

గురువరా! నీకు శిష్యుఁడై పరగునట్టి
ద్రుపదపుత్రుఁడౌ సుగుణుఁడౌ దృష్టద్యుమ్న

చేత, వ్యూహంబుగాను రచింపఁబడిన
పాండుపుత్రుల సేనను వసుధఁ జూడు. 3

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః.

పాండవానీకములలోనఁ బరగువారు
గొప్ప విలుకాండ్రు యుద్ధానఁ గుంతిపుత్రు
లైన భీమార్జునులసాటి యైనవారు
వారె, సాత్యకి మొదలైన వారు సుమ్ము 4

ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః.

పురుషవరుఁడైన శైబ్యుండు పుణ్యమూర్తి
ధృష్టకేతుండు వీరుండు తెగువశాలి
చేకితానుండు మఱి పురుజితుఁడు కాశి
రాజు కుంతిభోజుఁడు మహారథికు లంత 5

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః.

మానవంతుండు మఱియుత్తమౌజుఁ డొకఁడు
మహితవిక్రాంతుఁ డగు యుధామన్యుఁ డొకఁడు
ద్రౌపదేయులు మఱి సుభద్రాసుతుండు
రాజ! వీరలందఱు మహారథులు సుమ్ము 6

అస్మాకం తు విశిష్టా యే తాన్ నిబోధ ద్విజోత్తమ!
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే.

బ్రాహ్మణోత్తమ మనసేన రక్షకులను
ఉత్తముల ముఖ్యులైనట్టి యూర్జితులను
స్పష్టముగ నీకుఁ దెల్పెద సరగ నిపుడు
వినుము నాదగు మనవిని వీను లలర 7

భవాన్ భీష్మ శ్చ కర్ణ శ్చ కృప శ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణ శ్చ సౌమదత్తి ర్జయద్రథః

నీవు భీష్ముండు కర్ణుండు నిపుణమతులు
కృపుడు ద్రోణియు శూరులు కీర్తిమంతు
లాజి సైంధవపరిభృతు లధ్యాపకుండ!
వీరె మనసేనలో నుండు వీరవరులు 8

అన్యే చ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః
నానాశస్త్ర ప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః

మఱియు కొందఱు శూరులు మామకార్థ
మై యసువులు విడువ నిశ్చయంబు గలిగి
పెక్కు శస్త్రము ల్దాలిచి నిక్కువముగ
యుద్ధముం జేయనున్నారు శుద్ధచరిత! 9

అపర్యాప్తం త దస్మాకం బలం భీష్మాభిరక్షితమ్
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్.

భీష్ముచే రక్షితంబయి బిసుదుఁగన్న
సేన పూర్ణంబు గాదయా శ్వేతవాహా!

భీమరక్షితమగా సేన పేరునంది
పూర్ణముం గాంచె చూడుమా పూతచరిత! 10

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః
భీష్మ మేవాభిరక్షంతు భవంత స్సర్వ ఏవ హి.

మీర లందఱు వ్యూహాల మేటు లగుచు
స్థలముల న్వీడకుండంగఁ దనరనుండి
బిరుదుగాంచిన యట్టి యా భీష్ము నెప్పుడు
రక్షఁగావింపుఁ డన్ని పార్శ్వములయందు 11

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చై శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్.

శూరవరుఁడైన భీష్ముఁడు కౌరవులకు
పెద్దయై ధార్తరాష్ట్రుని యొద్ద కేఁగి
వాని సంతోష మనునట్టి వార్ధిఁ దేల్చ
కంబు పూరించి సింహనాదంబు చేసె 12

తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః
సహసైవాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్.

పిదప కౌరవసేనలు పేర్మితోడ
పణవ శంఖము లాదిగా వాద్యభేద
ములను మ్రోగించి రంతట నిలను వేగ
దానిచే గొప్పధ్వనియయ్యె ధరణినాథ! 13

తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవ శ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః.

తెల్లనౌ యశ్వములచేతఁ దేజరిల్లు
గొప్పదైనట్టి రథమునఁ గూర్మి నుండి
మాధవుండును విజయుండు మోద మలర
శంఖములను బూరించిరి సరగ నపుడు 14

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః.

పాంచజన్యంబు పూరించెఁ బద్మనాభుఁ
డర్జునుఁడు దేవదత్తంబు నిర్జరులకు
భయము కలుగంగఁ బూరించెఁ బవనపుత్రు
డంత పూరించె పౌండ్రింబు వింతగాను 15

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకుల స్సహదేవ శ్చ సుఘోష మణిపుష్పకౌ.

అధికవిజయంబుఁ బూరించె నంతకాత్మ
జుండు నకులుండు పూరించె చోద్యముగ సు
ఘోష మనునట్టి శంఖంబు కోర్కె నూదె
పుణ్యుడౌ సహదేవుండు పుష్పకంబు. 16

కాశ్య శ్చ పరమేష్వాస శ్శిఖండీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాట శ్చ సాత్యకి శ్చాపరాజితః.

కఠినమౌ విల్లు దాల్చిన కాశిరాజు
ద్రుపదపుత్రుండు సాత్యకి ద్రోణశత్రు
డగు శిఖండియు విరటుండు మిగుల సంత
సములతోడ పూరించిరి శంఖములను

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే!
సౌభద్రశ్చ మహాబాహు శ్శంఖాన్ దధ్ముః పృథక్పృథక్.

ఓయి కురురాజ! యల ద్రౌపదేయు లప్పుడు
ద్రుపదఫల్గునపుత్రులు తుములమైన
సంగరాంగణమందున శంఖములను
వేరు వేరుగ నూదిరి వీరవరులు

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్.

సంకులంబైన యా మహాస్వాన మప్పుడు
భూనభోంతరములు నిండె బూర్తిగాను
ధార్తరాష్ట్రుల హృదయవిదారకంబు
నయ్యె నా ధ్వని కురురాజ! యధికముగను

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః.

పిదప నొండొరుల్ బాణము ల్వేయునప్పుడు
వానరధ్వజు డైనట్టి ఫల్గునుండు
యుద్ధసంనద్ధులైన దుర్యోధనుండు
ఆదిగాఁగలవారిని మోద మలర

హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే!
సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత!
యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే.

యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః.

చూచివిల్లెక్కు-పెట్టియు చోద్యముగను
పల్కె నీరీతిఁ గృష్ణుతోఁ బ్రౌఢముగను
మాధవా! దుష్టుఁడైన దుర్యోధనునకు
యుద్ధమందున మేల్సేయ సిద్ధులౌచు 21

ఎవరు వీరులు వచ్చిరో బవరమునకు
ఎవరితో యుద్ధముం జేయ నవసరంబొ
వారినెల్లర నేఁ జూతు వారిజాక్ష!
స్యందనము నిల్పు ముభయసైన్యముల మధ్య. 22, 23

ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత!
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్.
భీష్మద్రోణ ప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూ నితి.

మానధనుఁడైన యర్జును మాటలు విని
ద్రోణ భీష్మాదివీరులు ద్రోణసుతుఁడు
మొదలుగాఁగలవారల యెదుట రథము
నిలిపి, యాయతంబైన సేనలను జూపి
పార్థివునిఁ జూడుమని హరి పలికె నపుడు 24, 25

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రా న్పౌత్రా న్సఖీం స్తథా.
శ్వశురాన్ సుహృద శ్చైవ సేనయో రుభయో రపి

అర్జునుఁడు రెండుసేనల యందు నున్న
గురువులైనట్టి ద్రోణాది వరుల మఱియుఁ
దాత తండ్రుల మిత్రుల ధరణివరుల
సోదరుల పుత్ర పౌత్రులఁ జూచె నపుడు

తా న్సమీక్ష్య స కౌన్తేయ స్సర్వా న్బన్ధూ నవస్థితాన్.
కృపయా పరయాఽఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్,

బవరమున కేగుదెంచిన బంధువులను
అందఱం జూచి యర్జునుఁ డధికమైన
కరుణ సంతప్తహృదయుఁడై కమలనాభుఁ
జూచి యీరీతిఁ బల్కెను జోద్యముగను

దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితమ్.
సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి
వేపథు శ్చ శరీరే మే రోమహర్ష శ్చ జాయతే.

యుద్ధముం జేయ వాంఛతో సిద్ధమైన
యాత్మబంధుగులం జూడ నవయవముల
బలములేకుండె దేహాన వణకుఁ బుట్టె
లపనమును నెండె రోమహర్షంబు గల్గె

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే
నచ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః.

కరమునుండియు గాండీవ శరము నిపుడు
జారుచున్నది నామేని చర్మ మంత

తాపమందుచునున్నది భూప! మనము
చంచలంబయ్యె నే నుండఁజాల నిపుడు 30

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ !
నచ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే.

అశుభసూచక శకునము లధికముగను
దోఁచుచున్నవి మాధవా! తుములమైన
జన్యమందున నాదగు జనము చంపి
పిదప శుభమును గోరను ముదముతోడ. 31

న కాంక్షే విజయం కృష్ణ! నచ రాజ్యం సుఖాని చ,
కిం నో రాజ్యేన గోవింద ! కిం భోగై ర్జీవితేన వా.

వలదు రాజ్యంబు జయమును వాసుదేవ !
వలదు సుఖమును భోగంబు పద్మనాభ !
బంధుగణములు మరణంబు నొందఁ బిదప
రాజ్యమేలను? సుఖమేల? బ్రతుకదేల? 32

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ,
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ.

ఎట్టి జ్ఞాతుల జీవింప నిర్ధరాన
రాజ్యభోగంబు సుఖమును భోజ్య మగునొ
అట్టి జ్ఞాతులు ప్రాణ ధనాదులందు
ఆశవీడియు యుద్ధాన హాజరయిరి. 33

ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః,
మాతులా శ్శ్వశురాః పౌత్రా శ్శ్యాలా స్సంబన్ధిన స్తథా.

వారు గురువులు తండ్రులు పద్మనాభ!
మామలును బావమఱదులు మాధవుండ!
తాతలును మేనమామలు పూతచరిత!
బంధువులు కూడ కలరు సంబంధమైన. 34

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన!
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే.

శ్రీధరా! వీరు నన్ను హింసించుచున్న
వారలైనను, హింసింపఁగోర నేను
రాజ్యలాభంబు కొఱకునై రణమునందుఁ
జంప నుద్యోగముం జేయఁ జనునె? నాకు. 35

నిహత్య ధార్తరాష్ట్రా న్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన!
పాప మేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః.

కృష్ణ! దుర్యోధనాదుల న్గేవలముగఁ
జంప మనకేమిగల్గును సంతసంబు
మనల జంపుట కుద్యుక్తు లైనఁగాని
చంపఁబూనుట పాపంబు చక్రధారి! 36

తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్,
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ!

కాన బాంధవసహితులై ఘనతఁ గన్న
ధార్తరాష్ట్రులఁ జంపుట తగదు మనకు
స్వజనముం జంపి సుఖమును బడయు టెట్లు?
చక్రధర! నాకుఁ దెల్పుము సరగ నిపుడు॥ 37

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః,
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్.

రాజ్యలోభంబుచే ధార్తరాష్ట్రులంత
వంశనాశనదోషాన వచ్చునట్టి
మిత్రమోసంబుచేతను మెలగునట్టి
పాతకంబును వారలు బాగుగాను॥ 38

కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్,
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన !

తెలిసికొన కుండదగునయ్య దెల్లముగను
వంశనాశనమునఁగల్గు పాతకంబు
చూచుచున్నట్టిదానిని శుద్ధచరిత
మనము విడువంగవలయును మాధవుండ! 39

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత.

అన్వయంబు నశింపగా నాదినుండి
వచ్చు ధర్మాలు నశియించు వసుధయందు
ధర్మము నశింప కులము నధర్మమొందు
పిదప నాచారములు చెడు విశ్వనాథ! 40

అధర్మాభిభవా త్కృష్ణ ! ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ ! జాయతే వర్ణసంకరః.

కులము ధర్మంబుతో సరికూడకున్న
స్త్రీలు భ్రష్టాత్మ లగుదురు స్నేహితుండ

సుందరులు దుష్టులైయుండ సులభముగను
వర్ణసంకరముం గల్గు వాసుదేవ ! 41

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ:
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియా:.

వర్ణసంకరంబు వంశనాశకులకు
వంశమునకుఁగూడ వసుధయందు
నరకలోక సిద్ధి నిరతంబుగూర్చును
లుప్త పిండులగుదురు పితరులును॥ 42

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః.

ఘోరనరకానబడుదు రవారణముగ
వంశనాశకులైనట్టి వారిచేతఁ
గలుగు సంకర మద్దాన వలన నెపుడు
వంశకులధర్మములు చెడు భ్రష్టములయి 43

ఉత్పన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన!
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ.

చెడిన కులధర్మములుగల చెనఁటులకును
"శాశ్వతంబుగ నరకవాసంబుఁ గలుగు"
అనుచుఁ బెద్దలుచెప్పగా మునుపు నేను
పుండరీకాక్ష! వినియుంటి పూర్ణముగను. 44

అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
య ద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః.

అచ్యుతా! రాజ్యమందున్న యాశచేత
బంధుజనమును జంపంగ వచ్చినాము
అధికమైనట్టిపాపంబు పృథివియందు
మనము చేయుచున్నాము మన కదేల? 45

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్

ఆయుధము లేక బదు లేమి చేయకుండ
నున్న నను, శస్త్రపాణులై యుద్ధమందు
ధార్తరాష్ట్రులు వధియింప దక్షులేని
నాకు మిక్కిలి క్షేమంబు నళిననేత్ర॥ 46

ఏవ ముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః.

పల్కి పూర్వోక్తరీతిగా పార్థివుండు
శోకసంతప్తహృదయుఁడై సుఖములేక
శరముతోఁ గూడ ధనువును సరగవిడచి
రథముపైఁ గూలఁబడియె విరక్తుడగుచు॥ 47

అర్జున విషాదయోగ మనెడు ప్రథమాధ్యాయము ముగిసెను.

---

# రెండవ అధ్యాయము

## సాంఖ్యయోగము



తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః.

అట్లుజాలితోఁగూడియు నశ్రుపూర్ణ
వ్యాకులేక్షణుఁడగుచును శోకమందు
చున్న యర్జునిఁ గనుగొని చోద్యమంది
కృష్ణుఁ డీరీతిఁ బల్కెను జిష్ణుతోడ॥

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున!

పామరులచేత సేవింపఁ బడినదియును
స్వర్గమునకు ననర్హమై పరగునది యు
కీర్తిలేనట్టిమోహంబు పార్థ! యెట్లు
వచ్చె, నినుఁ జేరె సంకటావస్థయందు 2

క్లైబ్యం మాస్మగమః పార్థ! నైత త్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!

భయముచెందకు మిప్పుడు పార్థ! నీవు
తగదు నీకిది శాత్రవతాపనుండ!
పరగ విడువుము హృదయదౌర్బల్య మిపుడు
యుద్ధసన్నద్ధుఁడవు గమ్ము శుద్ధచరిత! 3

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన!
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన!

శత్రుసంహారకుండ యో శౌరి! పూజ
కర్హులా భీష్మగురులతో నాజియందు
శరములనుదాల్చి యెదిరించి కరము నేను
సరగ నేరీతి యుద్ధంబు సల్పువాడ॥ 4

గురూ నహత్వా హి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్ష మపీహలోకే,
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్.

గొప్పవారగు గురువుల గూల్చకుండ
తిరిపెమెత్తిన యన్నంబు తినుటమేలు
ద్రవ్యకాంక్షులౌగురువులఁ దగ వధించి
యస్రసిక్త భోగము లెటు లనుభవింతు॥ 5

నచైతద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః,
యా నేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః.

వారు మనల జయించుటో వసుధయందు
మనము వారి జయించుటో మనకు రెంటి
యందు గొప్పదెయ్యది? తెల్పు మాదిపురుష!
యెవరిఁ జంపిన పిమ్మట యిహామునందు
బ్రతికియుండియు లాభంబుఁ బడయలేమొ
వార లెదుటనె యున్నారు వాసుదేవ! 6

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామిత్వాం ధర్మసమ్మూఢ చేతాః
య చ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి త న్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్.

లోభమనునట్టి దోషాన లుప్తమైన
శౌర్యచిత్తంబుగలవాడ శౌరి! ధర్మ
మేదియో నాకు విశదంబుకాదు జగతి
నడుగుచుంటిని యద్దాని యధిప! నిన్ను
నేను నీకు శిష్యుడ కృష్ణ! నిన్ను శరణు
బొందితిని నన్ను శిక్షింపు పురుషముఖ్య! 7

నహి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్య చ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణాం
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యం||

పగతులును లేక సర్వసంపత్సమేత
మైన రాజ్యంబు పొందిన నమరరాజ్య
పదవినందిన, నింద్రియ వర్గములకు
మిగుల సంతాపకరమయి రగులుచున్న
పీడ యెట్టుల పోవునో విశ్వరూప!
అద్ది తెల్పుము దుఃఖంబు నణగద్రొక్క|| 8

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః
న యోత్స్య ఇతిగోవింద ముక్త్వా తూష్ణీంబభూవహ||

శత్రుసంహారకుండైన, సవ్యసాచి
పరమపురుషునితో నిట్లు పల్కి, మఱియు
పచ్చవలువను దాల్చిన వానితోడ
యుద్ధముం జేయ నని పల్కి యూరకుండె॥ 9

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత!
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదం వచః.

అటుల నుభయసేనలమధ్య నధికముగను
శోకమందుచునున్నట్టి శూరవర్యుఁ
డైన యర్జునిఁ దిలకించి యంబుజాక్షుఁ
డిట్లు పల్కెను నవ్వుచు నేరుపడఁగ॥ 10

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాం శ్చ భాషసే,
గతాసూ నగతాసూం శ్చ నానుశోచంతి పండితాః.

పరితపించుటకుఁ దగని వారిఁ గూర్చి
దుఃఖ మందుచునుంటివి తుదకు నీవు
పలుకుచున్నావు పండిత భాషణములు
చచ్చుజనులకుఁ బ్రతికెడు జనుల కొఱకు
పండితులు దుఃఖమందరు ఫల్గుణుండ! 11

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః,
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతః పరమ్.

నేను సర్వదాయున్నాను నీవు నటులె
రాజులందఱు నట్టులే రథికవర్య

దేహనాశంబు పిమ్మట స్థిరముగాను
జీవు లుందురు దానికై చింతయేల? 12

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర (స్తత్ర) న ముహ్యతి.

ప్రాణి కీ దేహమందున బాల్య యౌవ
నములు జరయును బొందుట నైజ మట్లొ
అన్య దేహంబు నందుట యటుల సుమ్ము
అందుచేఁ బండితుండు మోహ మొంద డెప్డు. 13.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణ సుఖ దుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత!

అర్జునా! చక్షురా దీంద్రియముల వలనఁ
బుట్టు శబ్దాదివిషయముల్ పురుషునకును
చలియు నుష్ణంబు మొదలగు సంకటములఁ
దెచ్చు కావున, ధైర్యముం దెచ్చికొనుము.॥ 14

యం హి న వ్యథయం త్యే తే పురుషం పురుషర్షభ!
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే.

పురుషసింహమ! సుఖదుఃఖములను సరిగ
నెంచి, జ్ఞానియై యెవ్వఁ డీ పృథివిలోన
బాధ వీనిచే నొందడో వాడు సతము
మోక్షమంద సమర్థుండు ముఖ్యముగను॥ 15

నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః,
ఉభయో రపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః.

దేహ మెప్పుడు నశియించుఁ దెల్ల మిదియ
ఆత్మ యెప్పుడు నశియింప దర్జునుండ!
తత్వ మెఱిగిన కోవిదుల్ తథ్యముగను
ఉభయనిర్ణయమును జేయ ప్రభువు లెపుడు॥ 16

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చిత్ కర్తు మర్హతి.

దేనిచే సర్వజగమును దీప్తమగుచు
వ్యాప్తమై యున్నదో యట్టి యాత్మ యెపుడు
నాశ మందదు, మరణ మున్గాంచఁజేయ
నెవరి శక్యంబు గాదయా యింద్రతనయ! 17

అంతవంత ఇమే దేహా నిత్య స్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత!

ఆత్మనాశంబు లేనివా డనుచు, సతము
నుండువాఁడని, యప్రమేయుండు ననుచు
దేహములు నశించునవని తెల్లమయ్యె
నందుచే యుద్ధమును జేయు మర్జునుండ! 18

య ఏనం వేత్తి హంతారం య శ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే.

ఆత్మ చంపివేయునదని యనునో యెవడు
ఆత్మ చంపఁబడునదిగా ననునో యెవడు

వార లిద్దఱు తెలియనివారు జగతి
నాత్మ హంతయు హన్యమానంబు గాదు॥ 19

నజాయతే మ్రియతే వా కదాచి న్నాయంభూత్వా భవితా వా న భూయః,
అజో నిత్య శ్శాశ్వతో౾యం పురాణో౾నహన్యతే హన్యమానే శరీరే.

పుట్టుకయుఁ జావు దీనికి భువిని లేదు
ఎల్ల కాలంబునందున నేకరీతి
గాను నుండు నొకప్పుడుఁ గాదు మార్పు
సమయు గాత్రము నాత్మకుఁ జావు లేదు 20

వేదా౾వినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ ! కం ఘాతయతి హంతి కమ్ ?

నిత్యమనియును నజమని సత్యమైన
దనియు నాత్మక్షయములేని దనుచు నెవ్వఁ
డెఱుఁగునో యట్టి యాతఁడు నెట్లు చంపఁ
బడును? వాఁ డెట్లు వధియించు? పార్థివేంద్ర! 21

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరో౾పరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ.

మనుజుఁ డెట్టుల చినిగిన మలినవస్త్ర
ములను వీడి నూతనవస్త్రములను దాల్చు
అటులె జీవుండు పూర్వదేహంబు వీడి
యన్యదేహంబు ధరియించు ననఘ! వినుము॥ 22

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః

ఆయుధములు నఱుకజాల వాత్మ నెపుడు
అగ్ని దహియింపలేదయ్య యాత్మ నెపుడు
వనము తడుపంగఁ జాలదు ప్రాణి నెపుడు
వాయు వెండింప నేరదు పార్థపుండ! 23

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ
నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః.

ఆత్మ ఛేదింప దహియింప నలవికాదు
జ్ఞాన కర్మేంద్రియముల గోచరముగాదు
ఆత్మ నిత్యమై యచలమై యలరుచుండు
ఆదినుండియు నున్న దీ యాత్మ యెపుడు 24

అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి.

ఆత్మ మనసునకుం దెలియ నలవిగాదు
జ్ఞానకర్మేంద్రియముల గోచరముగాదు
ఆత్మవిషయక దుఃఖంబు నంద నీకు
తగదు వినుమయ్య నా మాట ధారుణీశ! 25

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్య సే మృతమ్
తథాపి త్వం మహాబాహో ! నైవం శోచితు మర్హసి.

అటులఁ గాకుండ నీయాత్మ కర్జునుండ!
పుట్టుకయుఁ జావు కలదని పుడమి నీవు
తలఁచుపక్షాన, మనసులోపలను దీనిఁ
గూర్చి చింతింపవలదయ్య కుంతిపుత్ర! 26

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

పుట్టువానికి మరణంబు పుడమిఁ గలదు
చచ్చువానికి జన్మంబు జగతిఁ గలదు
జననమరణముల్ తప్పవు సవ్యసాచి
కాన శోకింపఁ బనిలేదు పూని నీకు॥ 27

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా?

ఓయి యర్జునా! భూతము లుర్వియందు
మొదట విదితంబుగానివై పిదప విదిత
మై తుదను తెలియఁబడనివయ్యె జగతి
నట్టి దేహాలవిషయమై యార్తి యేల? 28

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవచ్చైన మన్య శ్శృణోతి శ్రుత్వాఽప్యేనం వేద న చైవ కశ్చిత్.

ఆత్మ నొక్కఁడు విస్మయం బంది చూచు
పాణి నొక్కఁడు విస్మయం బంది చెప్పు

వేసోకంతు జీవుని విని వింతఁజెందు
కనుక నీయాత్మ నెవ్వండు కానలేడు॥ 29

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత !
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి.

దేహమునకుఁ జావుండిన దేహి కెపుడు
చావు లేదండ్రు కావున నీవు భీష్ముఁ
డాది దేహాలయందున్న యాత్మలకును
పరితపింపంగ తగదయా పార్థివుండ! 30

స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే.

ఈవు నీధర్మమును విచారించితైన
కదనము నీవడఁ జనదని విదితమయ్యె
ధర్మసహితమౌ యుద్ధంబు తగ నొనర్ప
బాహుజులకును మంగళం బనిరి బుధులు॥ 31

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్
సుఖినః క్షత్రియాః పార్థ !లభంతే యుద్ధ మీదృశమ్.

యత్నముం జేయకుండ నాయత్తమైన
తెఱవబడినట్టి ద్వారాల తెన్నుగల్గు
స్వర్గము న్యుద్ధముం బొంద క్షత్రియులకు
నింతకంటెను మేలు వే రేది కలదు॥ 32

అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి
తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి.

అందుచే నీకు ధర్మమై యలరునట్టి
యుద్ధముం జేయకుండంగ నుంటివేని
తావకంబైన ధర్మంబుఁ దగ యశస్సు
చెడును పాపంబు తప్పక చేరు నిన్ను॥ 33

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే.

నరులు నీదగు నపకీర్తి నాల్గుదిశల
చాలకాలంబువఱకును జాటుమంద్రు
అట్టి యపకీర్తి పొందియు నలఁగుకంటె
మరణ మొందుట శ్రేయంబు ధరను నీవు॥ 34

భయా ద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్.

యుద్ధనిపుణులౌ కర్ణ దుర్యోధనాదు
లైన వీరులలో నీవు నధికుఁడవని
పేరుపొందతి విప్పుడీ విధము సేయ
కాందిశీకుండవని యండ్రు ఘనతపోవు॥ 35

అవాచ్యవాదాంశ్చ బహూ న్వదిష్యంతి తవాహితాః
నిందంత స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్?

తావకంబైన శత్రువుల్ నీవిదివఱ
కంతటను జూపునట్టి సాహసములైన

కృత్యములు నిందఁజేయుచుఁ గేలి సేతు
రింతకంటెను దుఃఖము న్నేమి కలదు ||

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ ! యుద్ధాయ కృతనిశ్చయః.

అర్జునా! యుద్ధముంజేసి హతుఁడవగుదు
వేని స్వర్గంబు ప్రాప్తించు నిద్ధరాన
జయముకాంచితివేని రాజ్యంబు గలుగు
కాన యుద్ధముం జేయంగఁ గడఁగు మిపుడు || 37

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి.

సవ్యసాచి! నీవు జయాపజయము లాది
యైన ద్వంద్వంబులందు సమానమైన
బుద్ధికలవాడ వగుచును యుద్ధమిప్పు
చేయఁబూనుము పాపంబుఁ జెందవెపుడు || 38

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు
బుద్ధ్యా యుక్తో యయా పార్థ ! కర్మబంధం ప్రహాస్యసి.

అర్జునా! నీకుఁ దెల్పితి నాత్మతత్త్వ
రూపమైనట్టి జ్ఞానంబు రూఢిగాను
ముక్తిసాధకమై మోద మొందఁజేయు
కర్మయోగస్వరూపంబు కరము వినుము. 39

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే
స్వల్పమ ప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్.

ఫలముకోరక యీశ్వరార్పణము జేయు
నట్టి కర్మయోగారంభ మర్జునుండ!
వ్యర్థముంగాదు దోషంబు వసుధ లేదు
అట్టిధర్మంబు కొంచమై యలరియున్నఁ
బరగ రక్షించు సంసారభయమునుండి ‖ 40

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన!
బహుశాఖా హ్యనంతా శ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్.

నిశ్చయాత్మకమైనదై నిశితమైన
జ్ఞాన మొకరీతిగా నుండు సవ్యసాచి!
నిశ్చయరహితులైన విపశ్చితులకు
ప్రజ్ఞ లవి వేరు పెక్కులై పరగుచుండు ‖ 41

యా మిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ! నాన్య దస్తీతి వాదినః.

కామాత్మాన స్స్వర్గపరా జన్మ కర్మ ఫలప్రదామ్
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి.

భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే.

వేదఫలమును దెలిపెడి వాదములకుఁ
బ్రియులు "స్వర్గఫలము కంటె వేరు లేదు"

అనుచు వాదించునట్టి వా రనఘ! యీవ
ణ త్రయములను గోరిన నరులు, బుధులు 42

కాని వారును, భోగభాగ్యంబు ప్రాప్తి
కై, యనేకంబులైనట్టి కర్మభేద
ములను జెప్పునట్టివియును పుష్పములను
బూసి ఫలములొసంగని భూజములలై 43

చెవుల కింపగు వాక్యముల్ చెప్పువారి
మాటలను విని చెడునట్టి మానవులకు
నిశ్చయాత్మకమైనట్టి నిండు మనసు
గలుగ దెన్నటికైనను కంబుకంఠ ! 44

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున !
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్.

వేదచయము సంసారమే విషయమగును
అర్జునా! కామరహితుండ వగుచు, సతము
ద్వంద్వములను వీడినవాడ వగుచు, నెల్ల
వేళ సత్త్వగుణుండవై విజయ! వాంఛ
లను వదలుచు, నాత్మజ్ఞానమును గలిగియు
యోగకుశలంబు మానుము త్యాగి వగుము॥ 45

యావా నర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః.

కొద్ది యుదకంబు గలిగిన కూపమందు
స్నానమునుం జేయ ఫలమది సరిగ నెంతొ
కలుగుచున్నదో, యంతటఁ గంబు కలిగి
స్రోతముగఁ గల నదియందు స్నాతఫలము
అణగియున్నట్లె వేదములరదుఁ జెప్పఁ
బడిన కర్మలఁ జేయుటవలనఁ గలుగు
ఫలము మోక్షరూపగు మహాఫలములోన
లీనమగునయ్య యర్జునా! రిత్త కాదు. 46

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి.

కర్మ నాచరించుటయందె కలదు నీకు
చెల్లుబడి, కాని కోరిక యెల్లవేళ
నుండతగదయ్య ఫలముల నోయి నీవు
కర్మఫలముల హేతువు కావు సుమ్మ
కర్మచేయకుండుటయందు గాఢమైన
యాశ లేకుండ నుండుమో యర్జునుండ? 47

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ !
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే.

సంగమును వీడి కర్మల సరిగఁ జేయు
మర్జునా! యోగదృష్టితో ననవరతము

జయము నపజయమును గూడ సరిగఁ జూడు
మదియె యోగం బటంచును ననిరి బుధులు॥ 48

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ!
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః.

పార్థ! సమమైనబుద్ధితోఁ బరగఁ జేసి
నట్టి కర్మముకంటెను నధికముగను
ఫలముఁగోరుచు చేసిన ప్రబలకర్మ
కరము నీచంబు ఫలముల కాంక్షతోడ
కర్మ చేసెడువారలు ఖలులు, కాన
శరణఁ జెందుము పరమార్థజ్ఞానమునకు॥ 49

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం.

పార్థ! సమమైనబుద్ధితోఁ బరగువానిఁ
బుణ్యపాపంబు లవి రెండు పొంద వెపుడు
కాన నీవు యోగమునందుఁ గాంక్ష నిడుము
కర్మలందున యోగంబు ఘనము సుమ్ము॥ 50

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మ బంధవినిర్ముక్తాః పదం గచ్ఛం త్యనామయం.

సదృశమై యుండు బుద్ధితో సరిగ గూడు
నట్టి కోవిదు ల్కర్మచేఁ బుట్టు ఫలము
విడిచి, కర్మబంధములను వీడి, జన్మ

బంధములకు లోఁబడునట్టి వార లగుచు
నున్న మోక్షంబు గలుగును సన్నుతాంగ ! 51

యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి
తదా గంతాఽసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ.

ఎపుడు నీబుద్ధి మోహము నిరవుగాను.
విడచి, పరిశుద్ధతను వేగఁ బడయగలదొ
యపుడు నీవు వినతగిన యర్థమునకు
వినిన యర్థమునకుఁ గూడ వేడ్క-నిడవు॥ 52

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి.

వేదాంత శ్రవణముచే
నీదగు మతి యెల్లవేళ నిశ్చలమగుచుఁ
మేదిని నిలుచునో యప్పుడు
నాదగు స్థానంబు పొందనగ్గుఁడ వీవుఁ॥ 53

స్థితప్రజ్ఞస్య కా భాషా ? సమాధిస్థస్య కేశవ !
స్థితధీః కిం ప్రభాషేత ? కి మాసీత వ్రజేత కిమ్ ?

నిశ్చలంబైన బుద్ధితో నెగడువాని
కేమి లక్షణముండును కృష్ణ! వాఁడు
పలుకునది యేమి? చేసెడు పని యదేమి?
యెటుల గూర్చుండు సర్వదా యేమి పొందు? 54

ప్రజహాతి యదా కామా న్సర్వాన్ పార్థ ! మనోగతాన్
ఆత్మ న్యే వాత్మనా తుష్టః స్థిత ప్రజ్ఞ స్తదోచ్యతే.

ఆత్మరూపానుభూతిచే నధికముగను
సంతసించినవాడయి స్వాంతమందు
కలుగు కోరికల్ విడనాడి ఖలుఁడు కాక
వర్తనము చేయు నెవ్వాఁడు వాఁడె సతము
స్థితమతియటంచు బుధులచే జెప్పఁబడును॥ 55

దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః
వీత రాగ భయ క్రోధః స్థితధీ ర్మని రుచ్యతే.

కష్టములు కల్గు సమయాన కలతపడక
సుఖములం దాశ వీడుచు చొక్క వదలి
భయము క్రోధంబు విడచిన వాఁడు జగతి
స్థితమతి, ముని, యటంచును చెప్పఁబడును॥ 56

య స్సర్వ త్రానభిస్నేహ స్తత్తత్ ప్రాప్య శుభాశుభమ్
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

అసువులందున దేహాన నర్జునుండ !
స్నేహము వీడి యెవ్వాఁడు చిత్తమందు
మంగళామంగళంబుల మమత వీడి
వ్యధను చెందక యుండునో యతడు పార్థ!
స్థితమతి యటంచు పెద్దలు చెప్పుచుంద్రు॥ 57

యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః
ఇంద్రియా ణీంద్రియా ర్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

అంతటను కచ్ఛపము తన యవయవముల
సంహరించిన యట్టులె జగతియందు
చక్షురాదీంద్రియముల గోచరుఁడు గాక
సంచరించెడు యోగియే చంచలంబు
కాని మతి యని పరగును కంజనేత్ర ! 58

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.

తిండి మాత్రమే విడచిన దేహి యెప్పుడు
విషయములు కేవలంబుగా విడచుఁగాని
విషయవాంఛలు విడువవు విశ్వమందు
పరమపురుషుని జూచిన నరుని సతము
గోరికలు వీడు ధరణిలోఁ గుంతిపుత్ర ! 59

యతతో హ్యపి కౌంతేయ ! పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః.

అర్జునా! పండితుం డెంత యధికుఁడైన
బలముగలిగిన యింద్రియ పాళ్భవములు
వాని మనసును లాగును వసుధఁ గాన
జ్ఞాననిష్ఠుండు శుభమును గాంచుచుండు. 60

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

అట్టి యింద్రియప్రాబల్య మణగద్ర
చిత్త మెప్పుడు నాయందుఁ జేర్చప
ఇంద్రియంబులు స్వాయత్త మెనని
యూతఁడే స్థితప్రజ్ఞుండు భూతలమున

ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తే షూపజాయ
సంగా త్సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజ

విషయచింతచే పురుషుండు విజయ
వానియందునె మగ్నుఁడై వఱలుచ
దానివలననె కామంబు దానిచేతఁ
క్రోధముణ బుట్టుచున్నది కుంతిపుత

క్రోధా ద్భవతి సంమోహా స్సంమోహాత్ స్మృతివిభ్ర
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి.

అధికక్రోధంబువలన మోహంబు గఁ
మోహ మధికంబు నగునేని పురుష
గురువు చెప్పిన విషయంబు మఱచి
మఱపుచేతను బుద్ధియు మాంద్య ష
బుద్ధినాశంబుచేతను బురుషుఁడెపుత
నాశమందుచునున్నాడు నరుడ! విన

రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్
ఆత్మ వశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి.

పార్థ! యభిలాష ద్వేషముల్ పరగవీడి,
విను వశక్యంబుగానట్టి విషయములను
ననుభవించుచు స్వాధీనమైన మనసు
కలిగి, వర్తించు యోగియే ఘనుడు సుమ్ము
అతఁడు నిర్మలత్వంబును నందుచుండు॥ 64

ప్రసాదే సర్వదుఃఖానాం హాని ర స్యోపజాయతే
ప్రసన్న చేతసో హ్యాసు బుద్ధిః పర్యవతిష్ఠతి.

యోగి నిర్మలాత్మకుఁ డయి యున్న వాని
సర్వదుఃఖపుంజంబులు సమసిపోవు
స్వచ్ఛమగు మానసముగల వానియొక్క
బుద్ధి, నిశ్చలమగుచుండు శుద్ధచరిత! 65

నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా
న చాభావయతః శ్శాంతి రశాంతస్య కుత స్సుఖమ్.

ఇంద్రియంబుల నిగ్రహం బెపుడు లేని
వాని కాత్మవిషయబుద్ధి పరగ లేదు
మఱియు వానికి భావన మరిగిపోవు
ఆత్మభావన లేనట్టి వ్యర్థునకును
చిత్తశాంతియుఁ గలుగదు చిత్తశాంతి
లేనివానికి సుఖమది లేదుసుమ్ము॥ 66

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే
త దస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి.

స్వేచ్ఛగా విషయములందు జిత్త మెప్పుడు
సంచరింపంగఁ జేయుట చనదుసుమ్ము
అటుల స్వాంతంబు వర్తింప నర్జునుండ!
పెద్దగాలిచే సంద్రానఁ జిన్నపడవ
పోలె నుండును పురుషుండు పుడమియందు॥ 67

తస్మాద్యస్య మహాబాహో ! నిగృహీతాని సర్వశః
ఇంద్రియా ణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

ఓయి యర్జునా! యందుచేఁ బ్రాయికముగ
నింద్రియంబుల నన్నింటి నెవడు విషయ
వాంఛలందుండి త్రోసాడి పరగుచుండొ
వాని బుద్ధియు నిశ్చలం బగుచునుండు. 68

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః.

అఖిలభూతంబులకు రాత్రి యగునో యేది
దానియందున మేల్కాంచు జ్ఞాని యెప్పుడు
అఖిలభూతంబులకు పగలగునో యెద్ది
యద్ది నిశివలె యోగికి నగుచునుండు॥ 69

ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్.
తద్వ త్కామా యం ప్రవిశంతి సర్వేసశాంతిమాప్నోతి నకామకామీ.

జగతియందున నున్నట్టి సర్వనదులు
వచ్చి తనలోనఁ గలసిన వనధి యెటుల

హద్దుమీఱక యుండునో యటులె యోగి
శబ్దమాదిగాఁగలయట్టి సర్వవిషయ
ములను గ్రహియించుచున్నను ముక్తిఁ బొందు
కాముకుడు ముక్తిఁ బొందడు కమలనేత్ర! 70

విహాయ కామా న్యస్సర్వాన్ పుమాం శ్చరతి నిస్స్పృహః
నిర్మమో నిరహంకార స్స శాంతి మధిగచ్ఛతి.

ఎవడు సర్వకామములను భువిని విడచి
దేనియందును స్పృహలేక ధీరుడగుచు
నాది యను భావమునువీడి నళిననేత్ర!
యాత్మయందలి యభిమాన మణగద్రొక్కి
యుండునో వాడు శాంతిని నొందుచుండు॥ 71

ఏషా బ్రాహ్మీ స్థితః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి.

పార్థ! యిది బ్రహ్మనిష్ఠయై పరగుచుండు
దీనిఁ బొందిన మనుజుండు ధీవరేణ్య!
మోహమును జెందఁ డెప్పుడు పుడమియందు
నంత్యకాలంబునందైన నతడు ముక్తిఁ
గాంచు నియ్యది తథ్యంబు కంజనేత్ర! 72

సాంఖ్యయోగ మనెడు రెండవ యధ్యాయము ముగిసెను.

———

## మూడవ అధ్యాయము

# కర్మయోగము



జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన !
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ!.

కర్మయోగము కంటెను జ్ఞానయోగ
మధిక మని నీవు దెల్పితి వనఘ! కృష్ణ
అటులయగునేని కేశవా! దిటములేని
కర్మచేయు మటంచు చేలకరము నన్ను
ప్రేరణము చేయుచున్నావు పీత వాస! 1

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్.

స్పష్టముంగాని నీవాక్య చయమువల్ల
నాదు బుద్ధికి భ్రాంతియు నధికముగను
కలుగుచున్నది యిప్పుడు కాన నీవు
జ్ఞానకర్మలలో నెద్ది కరము పెద్ద
నిర్ణయముఁ జేసి తెల్పుము నీరజాక్ష! 2

లోకేఽస్మి౯ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్.

జ్ఞానయోగంబు చేతను సాంఖ్యులకును
కర్మయోగంబుచే యోగిగణములకును

ద్వివిధమా నిష్ఠ యని నీకు దెల్లముగను
దెలియ జెప్పితి పూర్వమే కలుషదూర!

న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
నచ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి.

కర్మలను జేయకుండిన నిర్మ ఁలునకు
కర్మశూన్యత కలుగదు కర్మములను
విడచినంతమాత్రమున విజయ! వినుము
యోగనిష్టయు సిద్ధింప దార్జితుండ! 4

న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్య తే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః.

ఎవ్వడును కర్మచేయక యివ్వసుధను
నుండనేర డొకపుడు కోదండనిపుణ!
ప్రకృతిజన్యంబులైన సత్వాదిగుణము
లతనిచేఁ గర్మచేయించు నర్జునుండ! 5

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థా న్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే.

ఎవడు కర్మేంద్రియంబుల నింద్రతనయ!
నిగ్రహించియు మనసుచే నింద్రియములఁ
జింతచేయుచునుండునో స్థిరతలేక
వాడు మూఢుడు కపటియై వఱలుచుండు 6

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే.

ఎవడు మనసుచే సర్వదా యింద్రియముల
వశముగావించి ఫలమునం దాశ విడచి,
పార్థ! కర్మేంద్రియములచేఁ బరగు కర్మ
యోగమును జేయునో యాత డుత్తముండు॥ 7

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః.

అందుచే నీవు కర్మము నర్జునుండ!
చేయవలయును, కర్మము ం జేయకుండ
నుండకూడదు, చేయుట యుత్తమంబు
కర్మచే శరీరస్థితి కలుగు నీకు॥ 8

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ ! ముక్తసంగ స్సమాచర.

ఈశ్వరార్థంబుగా జేసి యొసఁగునట్టి
కర్మకంటెను భిన్నమౌ కర్మ లోక
మునకు బంధనముం జేయుఁ బుడమియందు
కాన నీశ్వరార్థంబగు కర్మ నీవు
ఫలముకోరక చేయుము పార్థివుండ! 9

సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పు రోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్టకామధుక్.

యజ్ఞములతోడ మనుజుల నధికముగను
సృష్టిఁగావించి వారితో స్రష్ట మున్ను
పలికె నీరీతి "మీరలు వసుధయందు
యజ్ఞముల వృద్ధిఁజెందుఁడు" అవియె మీకు
వాంఛనీయంబు లొసగును ప్రథితముగను ॥ 10

దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ.

మీరు యజ్ఞాలచే ననిమిషుల సతము
వృద్ధిపొందింపఁ జేయుఁడు, వేల్పు లెపుడు
వర్షమాదిగా నొసగుచు వసుధ మిమ్ము
వర్ధనము చేయుచుందురు, వారు మీరు
ప్రేమకలవార లగుచును విశ్వమందు
ముక్తిగాంతురు సంసారరక్తి విడచి॥ 11

ఇష్టా న్భోగా న్హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః
తైర్దత్తా నప్రదా యైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః.

అమరులుఁ మీరు చేసిన యజ్ఞములకు
సంతసముగాంచి, కోరిన సకలవస్తు
చయము నిత్తురు, మీకును సరిగ వారి
నెవఁడు సంతోషపెట్టఁడో యిర్ధరాన
వాఁడు చోరుడే మఱి వేఱు కాఁడు సుమ్మ॥ 12

యజ్ఞ శిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః
భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మ కారణాత్.

యజ్ఞములఁ జేయ మిగిలిన యన్న మెలమి
భోజనముఁ జేయు పురుషులు పుడమియందు
పాపములచేత విడువంగఁ బడుదు రెపుడు
స్వార్థమునకయి యెవ్వారు వండుకొందు
రట్టి పాపులు పాపము లందుచుంద్రు॥ 13

అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్న సంభవః
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః.

అన్నమువలన భూతము లవతరించుఁ
బుట్టు నన్నంబు వర్షానఁ బుడమియందు
సవనములచేత వర్షంబు జాతమగును
కర్మ యజ్ఞంబువల్లనే కలుగుచుండు 14

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్.

కర్మ వేదంబువల్లనే కలుగుచుండు
వేదములు పరమాత్మచే వెడలుచుండు
అందుచే వేదమంతట న్వ్యాప్తమంది
యుంచబడినది యజ్ఞమం దోయి పార్థ! 15

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయ తీహ యః
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! స జీవతి.

పార్థ! పూర్వోక్తరీతిగాఁ బరగినడుపఁ
బడు జగచ్చక్ర మెవడును వర్తనమును
జేయఁ డవ్వాఁడు పాపమే యాయువుగల
వాఁడు నగుచు నింద్రియముల వశుఁడగుచును
వ్యర్థజీవనుఁడై భూమి పరుగుచుండు॥ 16

యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః
ఆత్మ న్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే.

ఆత్మవల్లనే నాసక్తి నందు నెవడు
ఆత్మచేతనే తృప్తుఁడై యలరు నెవడు
ఆత్మచేతనే నానంద మందు నెవడు
వాఁడు చేయఁదగిన కర్మ వసుధ లేదు. 17

నైవ తస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః.

అట్టి బ్రహ్మనిష్ఠునకు నో యర్జునుండ!
కర్మచేసిన పుణ్యంబు కలుగ దెపుడు
కర్మచేయకుండిన హాని కలుగకుండు
ధరణి వానికి సర్వభూతములవలన
నెట్టి ఫలితంబు లేదయా యింద్రతనయ! 18

తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః.

ఫలము కోరక కర్మను ఫల్గుణుండ!
సేవ చేయంగవలయును నియతితోడఁ

బురుషుఁ డట్టుల చేసినఁ బుడమియందు
ముక్తిఁ జెందును సంసార రక్తి విడచి॥ 19

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి.

జనకుఁ డాదిగాఁ గలవారు సవ్యసాచి!
ఫలముఁగోరక కర్మను బరగఁ జేసి
చిత్తశుద్ధినిఁ బొందిరి శ్వేతవాహ!
జనుల లాభంబు కొఱకునైన సరగ నీవు
అర్హుఁ డవు కర్మచేయుట కర్జునుండ! 20

య ద్య దా చరతి శ్రేష్ఠ స్తత్త దే .వేతరో జనః
స యత్ప్ర మాణం కురుతే లోక స్త దనువర్తతే.

బ్రహ్మవేత్తయు నే కర్మ పరగఁ జేయు
నన్య మానవు లాకర్మ నాచరింతు
రతఁడు దేని ప్రమాణమ చనునొ, దాని
నరులు చేయుచు నుందురు నళిననేత్ర! 21

న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నాఽనవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి.

విష్టపంబుల మూటను విజయ నాకుఁ
జేయదగు నట్టి కర్మ యోచింపలేదు
పొందఁ బడనిదియును లేదు పొందవలసి

నదియు లే దైన కర్మను నరుడ నేను
చేయుచున్నాను విడువక స్థిరముగాను॥ 22

యది హ్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః
మమ వర్త్మా౽నువర్తంతే మనుష్యాః పార్థ ! సర్వశః.

నేను జాగ్రత్తతోఁ గర్మ పూని సతము
చేయకుండిన మనుజులు స్థిరతలేక
అన్నివిధముల నామార్గ మనుసరింత్రు
ఫల్గునా! నిశ్చయంబిది పరగ వినుము. 23

ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహమ్
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః.

నేను కర్మంబు చేయని యెడల జనులు
నాశమొందుట తప్పదు నళిననేత్రి!
వర్ణసంకరమునకును వసుధ నేను
కర్తనగుదును మానవ గణమునకును
పాడుచేసినవాడనై పరగుచుందు॥ 24

సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత!
కుర్యా ద్విద్వాం స్తథా౽సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహం.

పండితులు కానివారలు ఫలము కోరి
యెటుల కర్మను చేయుదు రటులె జ్ఞాని
జనమునకు మంచిమార్గంబు సరగఁ జూపఁ
గర్మచేయంగవలయును నిర్మలాత్మ॥ 25

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్.

కర్మయందున నాసక్తి కలిగియున్న
జ్ఞానహీనుల కర్జునా! జ్ఞానవంతుఁ
డెపుడు బుద్ధిభేదంబు గల్గింపరాదు
తాను కర్మను సర్వదా తనరఁజేసి,
వారిచేఁ గర్మచేయింపవలెను సుమ్ము॥ 26

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే.

ప్రకృతిజన్యంబు లౌ సత్వ రజము లాది
గుణగణంబులచేఁ జేయఁ గోరినట్టి
కర్మ లన్నిటియందునఁ గర్త నేనె
యనుచుఁ భావించు మనుజుడో యర్జునుండ! 27

తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే.

జిష్ణా! గుణకర్మలను విభజించి యెఱిఁగి
కర్మరూపంబు లగు గుణగణము లెపుడు
విషయరూపంబులగు గుణగణములందు
నుండునని తాను తెలిసియు నుర్వియందు
జాగరూకుఁడై యుండును సవ్యసాచి! 28

ప్రకృతే ర్గుణసంమూఢాః సజ్జంతే గుణకర్మసు
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్న విచాలయేత్.

ఎవరు ప్రకృతి గుణముచేత భవమునందు
మోహమందుచు, ఫలమును బొందుటకయి,
కర్మలందున నాసక్తి గలిగి, పుడమి
నుందురో యట్టివారల నోర్మితోడ
నాత్మతత్వంబు దెలిసిన యతడు, వారి
చిత్తచాంచల్యమును పార్థ! చేయరాదు. 29

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః.

సర్వకర్మల నాయందె సరిగనుంచి
జ్ఞానముంగల్గి మఱియు నిష్కాముఁడవయి
"అధికుఁడన నేన" అను భావ మసలె వీడి
చింతవదలుచు యుద్ధంబుఁ జేయుమయ్య॥ 30

యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః.

ఎవ్వరీ నా మతంబును నీర్ష్యలేక
శ్రద్ధతో నాచరింతురో యిద్ధరాన
వారలున్గాడ కర్మల వదలి యెప్పుడు
నన్నుఁ జేరుదు రర్జునా! సన్నుతాంగ! 31

యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః.

నన్ను నిందించువారలై నా మతంబు
నెవరు చేయకయుందురో యిందిరతనయ!

వార లవివేకులై యుండి వసుధయందు
మూఢులై సర్వదా నాశ మొందుచుంద్రు॥ 32

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవా నపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ?.

పండితుఁడు గూడ పూర్వంపు భవమునందు
పొందఁబడినట్టి కర్మము పుడమియందు
ననుభవించుచునుండు నో యర్జునుండ !
సర్వభూతగణములు సంస్కారరూప
మైన ప్రకృతినే యశ్రాంత మాశ్రయించుఁ
గాన నింద్రియవిజయంబు కలదె? జగతి 33

ఇంద్రియ స్యేంద్రి యస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ.

ద్వేష రాగంబు లవి రెండు దిటముగాను
నింద్రియార్థంబులందున నిమిడియుండె
వసుధ నా రెంటి కెవ్వడు న్వశముగాక
మెలఁగవలె, నవి శత్రువుల్ మనుజులకును॥ 34

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

పరగఁ జేయబడిన పరధర్మమునకంటె
స్వీయధర్మ మెపుడు చేయ మేలు

స్వీయధర్మమందు శ్రేష్ఠము మరణంబు
పరుల ధర్మ మధికభయము సుమ్ము॥ 35

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ! బలా దివ నియోజితః.

ఇట్టి పురుషుంకు పాపము నెట్టులైన
చేయ నను నిశ్చయంబును జెందియున్న
వానిచేఁ బాపమెయ్యది వసుధయందుఁ
జేయునట్టుగ యత్నముఁ జేయుచుండె?
దానిఁ దెల్పుము నాకు నో దైత్యదమన! 36

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.

అర్జునా! రజోగుణజన్యమైన యట్టి
కామమే క్రోధరూపము న్గాంచుఁ బుడమి
మిగుల భక్షణకలదియై మెలగునిద్ది
పాపమే దీని రూపంబు పార్థ! వినుము
మోక్షమున కిద్ది శత్రువు ముఖ్యముగను. 37

ధూమేనా వ్రియతే వహ్ని ర్యథాఽదర్శో మలేన చ
యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్.

అగ్ని పొగచేత నెట్టుల యావరింపఁ
బడుచునున్నదో, గర్భస్థపాక మెటుల
మావిచేఁ గప్పబడినదో మానధనుడ!

అద్ద మేరీతి ధూళిచే నావరింపఁ
బడుచునున్నదో, యట్టులె పార్థ! వినుము
కామమున జ్ఞానమెప్పుడు కప్పబడును॥ 38

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ! దుష్పూరేణానలేన చ.

అర్జునా! జ్ఞాని కయ్యది యధిక శత్రు
వగుచు నిందింపరానిది యగుచు, తృప్తి
లేనిదగుచును సర్వదా జ్ఞానమునకుఁ
గప్పుచుండును కామము కాదు వశము॥ 39

ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతైర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్.

ఇంద్రియంబులు మనసును నింద్రతనయ!
బుద్ధియును దీని కాశ్రయపుంజ మనుచుఁ
జెప్పఁబడినది, కామము శ్వేతవాహ!
యింద్రియాదులఁ జ్ఞానమున్ సాంద్రముగను
కప్పి, పురుషుని మోహితుఁ గాఁగఁ జేయు॥ 40

తస్మా త్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ !
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్.

ఇంద్రతనయుండ! నీవు నీయింద్రియముల
మొదట స్వాధీనముం జేసి పుడమియందు

జ్ఞాన విజ్ఞానముల నాశకంబు నగుచుఁ
బాపరూపమగు కామంబు పరగ విడువు। 41

ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనస స్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః.

స్థూలదేహంబు కంటెను శుద్ధగాత్రి
యింద్రియంబులు శ్రేష్టము లింద్రియముల
కంటెఁ జిత్తము గొప్పది కంజనేత్ర!
బుద్ధికంటెను నాత్మయే పుడమి గొప్ప॥ 42

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్.

బుద్ధికంటెను గొప్పదై శుద్ధమైన
యాత్మ బాగుగ నెఱుగుచు నర్జునుండ!
యాత్మచేతనే బుద్ధిని యణచినీవు
శత్రువైనట్టి కామమున్ సంహరించు॥ 43

కర్మయోగమనెడు మూడవ యధ్యాయము ముగిసెను.



# నాలుగవ అధ్యాయము

## జ్ఞానయోగము

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్.

అవ్యయంబైన యీ యోగ మర్కునకును
నేను జెప్పితి, నాతఁడు నేర్పుతోడ
నతని తనయునకుం జెప్పె, నతఁడు సూర్య
వంశజుండైన నిక్ష్వాకు పార్థివునకుఁ
దెల్పె, దీనిని యర్జునా! తెల్లముగను 1

ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
న కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప !.

అవని నర్జునా! నిమి మొదలైన రాజ
వరు లిటుల పరంపరముగాఁ బ్రాప్తమైన
యోగవిద్యను, నెఱిఁగిరి యుర్వియందు?
నట్టి యోగంబు ప్రాచీన మగుటచేత
నాశ మొందెను లోకాన నళిననేత్ర! 2

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమం.

అర్జునా! నాకు భక్తుండ వగుట చేసి
మఱియు మిత్రుండ వగుటచేఁ బరగ నీకు

నుత్తమము గుప్తమును నగు యోగవిద్య
స్పష్టముగ నేను దెల్పితిఁ సవ్యసాచి! 3

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి.

వేడి వేలుపు ముందుగా విశ్వమందుఁ
బుట్టె, పిమ్మట నీవును బుట్టినావు
అటుల యగు నేని నీవు నా యర్కునకును
నిట్టి యోగంబు నుపదేశ మెటులఁ జేసి
నాడవు? పరగఁ దెల్పుము నాకు నీవు॥ 4

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జునా!
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప!

గడచినవి పార్థ! నా కనేకంబులైన
జన్మ లట్టివె నీకు నో సవ్యసాచి!
వాని నన్నిట నెఱుగుదు నేను, నీవు
తెలిసికొనజాల వవ్వానిఁ దెల్లముగను॥ 5

అజోఽపి స న్న వ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా.

అజుఁడనై యవ్యయాత్మకుఁడైన నేను
ప్రాణులకు నియామకుండనై పరగుచుండి
మామకంబైన మాయచే మానధనుఁడ!
పుట్టుచున్నాను సర్వదా పుడమిపైని॥ 6

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహమ్.

ధర్మమునకు హానియు నధర్మమునకు
వృద్ధియును గల్గుచుండునో యెప్పుడెపుడు
అపుడు నాదగు మాయచే నవని నేను
నన్ను సృజియించుచున్నాను నళిననేత్ర ! 7

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

శిష్టరక్షణ దుష్టుల శిక్ష సల్పి
ధర్మసంరక్షణమునకై ధరణి నేను
ప్రతియుగంబున సర్వదా పార్థివుండ!
యవతరించుచు నుంటినో యనఘ వినుము. 8

జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున!.

పుడమి నాదగు దివ్యమౌ పుట్టుకయును
కర్మయును, నిశ్చయంబుగాఁ గరము నెవడు
తెలిసికొనుచుండునో వాడు ధీవరేణ్య!
దేహమును వీడి, పొందఁడు తిరుగ జన్మ
నన్నె పొందుచునున్నాడు సన్నుతాంగ! 9

వీత రాగ భయ క్రోధా మన్మయా మా ముపాశ్రితాః
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః.

ప్రేమ భయములఁ గ్రోధంబు విడచి సతము
నన్నె చింతించి, సేవించి యున్న జనులు
పూతులగుచును జ్ఞానులై పుడమి నాదు
రూపమును జెందుచున్నారు రూఢిగాను॥ 10

యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహం
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః.

ఎవ్వరే రీతిగా నన్ను నిర్ధరాన
తెలియుచుందురో వారిని ధీవరేణ్య!
నేను నటువలె దయతోడఁ గూని చూతు
కాన నామార్గమున వారు కాంక్షతోడ
ననుసరించుచు నున్నా రహర్నిశములు॥ 11

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా.

భువనమందున మనుజులు ఫూర్తిగాను
ఫలము కోరుచు సర్వదా వాసవాది
సురగణంబుల సేవించుచుందు రోయి
మర్త్యలోకంబు నందున మాన్యచరిత!
కర్మఫలసిద్ధి వెంటనే కలుగుచుండు॥ 12

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయం.

కర్మగుణముల భేదానఁ గరము నేను
నాల్గువర్ణముల్ ధరణిలో నళిననేత్ర!
సృష్టిగావించి యుంటి నా సృష్టికెపుడు
నేను కర్తనై యుందును కాని కర్తఁ
గాను దీనిని తెలియుము కాంక్ష నీవు॥ 13

న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న న బధ్యతే.

కర్మలంటవు నాకు నీ కర్మసిద్ధి
యందు నాసక్తి లేదు నా కర్జునుండ!
ధీర! నన్ను నీ విధముగాఁ దెలిసికొన్న
జ్ఞాని యెప్పుడు కర్మచే కట్టబడడు॥ 14

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వై రపి ముముక్షుభిః
కురు కర్మైవ తస్మా త్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్.

పుణ్యవంతుండ దీనిని పూర్తిగాను
దెలిసికొని పూర్వులందఱు దీక్షతోడ
కర్మచేసిరి మోక్షేచ్ఛ కలిగియుండి
యాదినుండియు వచ్చిన యట్టి కర్మ
నీవు చేయంగవలయును నియతితోడ॥ 15

కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.

కర్మ యన నేది? మఱియు నకర్మ యేది?
యనెడు సంశయముం దెలియక యజ్ఞు లగుచు
మోహముం జెందుచున్నారు బుధులు కూడ
దీని నెఱిఁగియు భవవార్ధి తీరమునకుఁ
జేరెదవు నీవు దాని నపారముగను
దెల్పుచున్నాను నీ కది తెల్లముగను॥ 16

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః.

కర్మతత్వంబు మఱియు నకర్మమొక్క
తత్వముఁ వికర్మను గూడ ధరణిలోనఁ
దెలియవలయును జక్కగా ధీవరేణ్య!
వీని యాథార్థ్య మెఱుగంగ వీలుగాదు॥ 17

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్.

ఎవడు కర్మ నకర్మగా నిర్ధరాన
భావనం జేయుచుండునో బాగుగాను
ఎవ డకర్మను కర్మగా నెపుడు తలచు
వాడు నరులలో మతి కలవాడు సుమ్ము
యోగియై యెల్లకర్మల నుర్విఁ జేయు॥ 18

యస్య సర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః.

కర్మలందునఁ గోరికల్ గలుగకుండ
నుండు నెవ్వాఁడు సర్వదా యుర్వి మఱియు
జ్ఞాన మను నగ్నిచే దగ్ధమైన కర్మ
కలిగియుండునో యెవ్వాఁడు కాంచు ఫలము
అనుచుఁ బల్కురి కోవిదు లర్జునుండ॥ 19

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి సః.

కర్మఫలసంగము న్వీడి ఘనతగాంచి
సర్వదా తృప్తుఁడై నిరాశ్రయుఁడు నగుచు
కర్మలందున వర్తించు జ్ఞాని యగుచు
వాని కంటవు కర్మలు వసుధయందు॥ 20

నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్.

కోరికల వీడి చిత్తముఁ గుంతిపుత్ర!
తన కధీనంబు నగునట్లు తనరఁ జేసి
సర్వవిషయాల నభిమాన సరణి వీడి
దేహమాత్రమే పోషింప దీక్షబూను
నటుల కర్మను జేసిన యవని జనులఁ
బాపమంట దొకప్పుడు పార్థివేంద్ర! 21

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే.

దొరికినంతటి దానితోఁ దుష్టుఁ డగుచు
ద్వంద్వమగా గుణములకు లోబడక యుండి
యీర్ష్య యనునది లేకుండ నెసగుచుండి
సిద్ధ్యసిద్ధుల సముడయి చేయునట్టి
కర్మ గలవాడు కర్మచేఁ గట్టబడడు॥ 22

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే.

దేనియందున నాసక్తి లేనివాడు
ముక్తుడైనట్టి వాడును మోక్షమందు
నిశ్చలంబైన చిత్తాన నెగడువాడు
యజ్ఞములకయి చేసెడు నట్టి కర్మ
పూర్తిగా నాశమందును పుడమియందు 23

బ్రహ్మార్పణం బ్రహ్మ హవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా.

యజ్ఞపాత్రిలు బ్రహ్మమే యర్జునుండ
హోమద్రవ్యంబు బ్రహ్మమే హుతవహుండు
బ్రహ్మమే హోమమును జేయు వాడు బ్రహ్మ
మగును, కర్మ సమాధిచే ననుదినంబు
పొందు ఫలమును బ్రహ్మమే పూతచరిత! 24

దైవమే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి.

కర్మ యోగులు కొందఱు కర్మఫలము
కోరి జన్మంబు చేయుచున్నారు జగతి
జ్ఞానయోగులు కొందఱు పూని బ్రహ్మ
మనెడు నగ్నియందున కర్మ మను హావిస్సు
హోమమును జేయుచున్నారు భూప! వినుము 25

శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీ న్విషయా నన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి.

అన్యమానవుల్ జ్ఞానేంద్రియముల నెప్పుడు
నిగ్రహం బను నిప్పులో నియతితోడ
హోమమును జేయుచున్నారు భూమియందు
మఱియు కొందఱు శబ్దాది పరికరముల
నింద్రియములను నగ్నిలో నెల్ల వేళ
వ్రేల్చుచున్నారు ఫల్గునా! వింతగాను॥ 26

సర్వా ణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే.

ఇట్లు కొందఱు జ్ఞాన కర్మేంద్రియముల
శబ్దరూపాది విషయాల సరణిఁగనుచు,
ప్రాణదానాది దశవిధ వాయువుల, బ
హిర్గమన మాదికములను నింద్రియముల
నిగ్రహంబను నిప్పులో నియతితోడ
హోమమును జేయుచున్నారు భీమబలుడ! 27

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః.

ద్రవ్యయజ్ఞాల తాపసక్రతువు లెపుడు
చేయుచుందురు కొందఱు ప్రాయికముగ
మఱియు కొందఱు స్వాధ్యాయమఖము, యోగ
యజ్ఞమునుం జేయుచుందురు విజ్ఞులగుచు॥ 28

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః.

ప్రాణమందున విజయ! యపానమును, న
పానమందున ప్రాణమున్ బాగుగాను
వ్రేల్చుచున్నారు కొందఱు వేడ్కతోడ
నన్యజనులు పూరకరేచకాది సతము
పార్థ! ప్రాణాదిగతుల నవారణముగ
హోమమునుం జేయుచున్నారు భూమియందు॥ 29

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వే ఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః.

మఱియుకొందఱు మానవుల్ పరిమితంబు
నైన యాహారపరులయి యనుదినంబు
ప్రాణవాయ్వాదికములను పదిలముగను
వ్రేల్చుదురు వశీకృతవాయువితతియందు

వారు యజ్ఞముల్ తెలిసినవారు మఱియు
మఖముచేతను విగతకల్మషులు సుమ్ము॥ 30

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ!

యజ్ఞకర్మలో మిగిలిన యమృతమును భు
జించువారలు తప్పక స్థిరమగు నల
బ్రహ్మమును పొందుచున్నారు పైనఁ జెప్పి
నట్టివానిలో నొక్కటియైన, చేయ
నట్టివారికి నిహ మనునదియు లేదు
పరము నేరీతిఁగల్గును పార్థివేంద్ర! 31

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే
కర్మజా న్విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే.

బహువిధములైన యజ్ఞాలు బ్రహ్మవలనఁ
బైనఁ జెప్పిన రీతిగా ప్రభవమందె
యవ్వి యన్నియు కర్మజం బగునటంచు
వాని నెఱిగిన సంసారబంధనమున
నుండి ముక్తినిఁ గాంచెద వోయి! నీవు॥ 32

శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప!
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే.

ద్రవ్యసాధన సాధ్యమై తనరునట్టి
జన్నములకంటె జ్ఞానయజ్ఞములు మేలు

సర్వకర్మలు పార్థ! నాశనము గాక
జ్ఞానమందున లయమగు సవ్యసాచి! 33

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః.

తత్త్వవిదులైన జ్ఞానులు తనర నీకు
నేది యుపదేశ మిత్తురో యిలను దాని
ప్రశ్నచేతను సాష్టాంగ ప్రణతిచేత
సేవచేతను దెలియుము శ్వేతవాహ! 34

యద్ జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాండవ!
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి.

పాండుపుత్రుండ! యిల పరబ్రహ్మరూప
జ్ఞానమును పొందితి నేని మఱల
ఇట్టి మోహంబు కలుగ దదెట్టి దైన
నట్టి జ్ఞానంబువలన చరాచరంబు
లైన భూతముల్ నాయందు నరయగలవు॥ 35

అపి చే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి.

పాపు లందఱి కంటెను పార్థ! నీవు
పాపివైనను తాదృశ పాపచయము
జ్ఞానమనునట్టి తెప్పచేఁ గరము దాని
దాటఁ గలుగుదు వర్జునా! ధరణియందు॥ 36

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున!
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా.

బాగుగాఁ బ్రజ్వరిల్లిన పావకుండు
ఎటుల భస్మంబుచేయునో యింధనముల
నటులె జ్ఞానాగ్నిచే భస్మమగును సర్వ
కర్మలును పార్థ! తెలియుము కరము నీవు॥ 37

న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
త త్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి.

పార్థ! జ్ఞానంబుతో సరిపడెడునట్టి
పావనంబైన దేదియు పరగ లేదు
తాదృశంబగు జ్ఞానంబు ధరణియందు
యోగసిద్ధుండు సర్వముఁ దాృ్యగి యగుచు
తాసె తనలోనపొందును తథ్యమిదియ॥ 38

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి.

ఇంద్రియంబుల నరికట్టి యొసగువాడు
శ్రద్ధకలవాడు తత్పరాచరణమతియు
జ్ఞానమును బొంది యుత్కృష్టమైన చిత్త
శాంతిఁ బొందును పార్థివా! జగతియందు॥ 39

అజ్ఞ శ్చాశ్రద్దధాన శ్చ సంశయాత్మా వినశ్యతి
నాఽయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః.

అజ్ఞుఁడుఁ శ్రద్ధలేనట్టి యతఁడు సంశ
యాత్మకుంఁడును చెడిపోవు ననవరతము
వాని కీ లోకసుఖమును వసుధ లేదు
పరమునందలి సుఖమును పరగ లేదు. 40

యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ!

విజయ! యోగంబుచేతను విడువబడిన
కర్మకలవాని, జ్ఞానయోగంబుచేత
భిన్నసంశయుఁ దృఢమైన చిత్తు నెపుడు
ధీర! కర్మలు వాని బంధింపలేవు.

తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!

పుడమిఱేడ! యజ్ఞానసంభూత మగుచు
తావకంబగు మనసులోఁ దనరునట్టి
సంశయంబును జ్ఞానశస్త్రంబుచేత
ఛేదనము చేసి కర్మను చేయు మిపుడు
సిద్ధుఁ డవు కమ్ము యుద్ధంబుఁ జేయ నీవు॥ 42

భగవద్గీతయందు జ్ఞానయోగమనెడు నాల్గవ యధ్యాయము ముగిసెను.



# ఐదవ అధ్యాయము

## కర్మసన్యాసయోగము

సన్న్యాసం కర్మణాం కృష్ణ! పున ర్యోగం చ శంససి
య చ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్.

కర్మ విడువంగవలయును కరము నీవు
కర్మ చేయంగవలయును కరము నీవు॥
అనుచు బలుకుచునుంటివి యచ్యుతుండ!
రెంటి లోపల మిక్కిలి శ్రేష్ఠ మెద్ది?
దానిఁదెల్పుము లెస్సగాఁ దనర నాకు॥ 1

సన్న్యాసః కర్మయోగ శ్చ నిఃశ్రేయసకరా వుభౌ
తయో స్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే.

కర్మ విడుచుట చేయుట నిర్మలుండ
రెండు మోక్షంబునకుఁ ద్రోవ లెంచి చూడ
వాని రెంటిలో శ్రేష్ఠంబు ఫల్గుణుండ!।
కర్మ యోగంబు దానికి ఘనత కలదు॥ 2

జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వో హి మహాబాహో! సుఖం బంధాత్ ప్రముచ్యతే.

కోరికలు లేక దోషంబు కోలుపోయి
యెవడు కర్మలు చేసిన నిద్ధరాన

వాని సన్యాసి యని జనుల్ పలుకుచుండ్రు
ద్వేష రాగంబులును లేని విబుధు డెపుడు
సుఖముగా బంధనమునుండి చ్యుతినిఁ బొందు. 3

సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏక మప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్.

కర్మ సన్యాస కర్మయోగములు రెండు
వేరు వేరని చెప్పుచున్నారు మూర్ఖు
లెపుడు కోవిదుల్ చెప్పరు హే కిరీటి!
రెంటిలో నొక్కదానిని దిట్టగాను
యాశ్రయించిన లెస్సగా నధిక ఫలము
పొందుచుండును మనుజుఁడు పుడమియందు 4

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి.

సాంఖ్యులకుఁ బ్రాప్తమైనట్టి స్థానమెద్ది
కలదొ యద్దాని యోగులు గాంతు రెపుడు
వాని రెంటిని నొకటిగాఁ బార్థ! యెవడు
చూచునో వాడు జ్ఞానియౌ సుమ్ము జగతి॥ 5

సన్న్యాస స్తు మహాబాహో! దుఃఖ మాప్తు మయోగతః
యోగయుక్తో ముని ర్బ్రహ్మ న చిరేణాఽధిగచ్ఛతి.

అర్జునా! కర్మలేని సన్యాసమెటులఁ
బొందకష్టంబు, ఫలమును బొంద వాంఛ
లేని యాతఁడు జ్ఞానియౌ పూని వాడు
శీఘ్రముగ బ్రహ్మమును జెందు శ్వేతవాహా! 6

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మభూతాత్మా కుర్వ న్నపి న లిప్యతే.

పార్థ! కర్మయోగము చేయువాడు సతము
చిత్తపారిశుధ్యంబును జెంది యుండి
మానసికమును స్వాధీనమందు నుంచి
గెలువఁబడిన యింద్రియంబుల గలిగి సర్వ
భూతములు తానె యనుచును పుడమిఁ దలఁచి
తాను భూతాత్మకుండుగాఁ దగ నెఱింగి
కర్మచేసిన, కర్మచేఁ గట్టుబడఁడు॥ 7

నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్

ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నపి
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్.

తత్త్వవేత్త సర్వంబును ధరణియందు
చూచుచున్నను వాసనల్ జూచుచున్న
తాకుచున్నను నడచినఁ దనర యన్న
మును భుజించిన, నిద్రను పోవుచున్న
నడచుచున్నను ,వినుచున్న నయనములను
తెఱచినన్ మూయుచున్నను స్థిరముగాను
చక్షురాదీంద్రియముల సరిగ విషయ
వాంఛలందున వర్తించి పరగుచున్న

వనుచుఁ దెలిసియు బ్రహ్మసమానట్టి తాను
నేమి చేయుటలేదని యెప్పుడు తలఁచు॥ 8,9

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా.

అఖిలకర్మలఁ బరమాత్మ యందు నుంచి
సంగమును వీడి యెవ్వాఁడు సరిగ వానిఁ
జేయుచుండునో వాఁడు రాజీవపత్ర
మందు నుదకంబు రీతిగా నర్జునుండ!
పాపములచేతఁ దా నంటఁ బడఁడు సుమ్ము॥ 10

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే.

కర్మయోగులు మానసకలుష మెపుడు
వీడి; ఫల మపేక్షింపక విగ్రహంబు
చేత, మానసికముచేత శ్వేతహయ!
బుద్ధిచే, నింద్రియములచే, బుడమియందు
కర్మలను జేయుచున్నారు నిర్మలులయి॥ 11

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే.

యోగి కర్మఫలంబును త్యాగి యగుచు
శాంతిఁబొందుచునున్నాఁడు సవ్యసాచి!

యోగికానట్టి యాతఁడు త్యాగికాక
బద్ధుడై యుండు సంసార వార్ధియందు 12

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్న కారయన్.

ఇంద్రియంబులఁ జేతయై యొసగువాఁడు
మనసుచే సర్వకర్మల మమతవీడి
నవకమగు ద్వారములుగల నగరమనెడు
దేహమందున నవ్వాని స్థిరముగాను
నుంచి, కర్మచేయకను, చేయింపకెపుడు
సుఖముగానుండు భువిలోన సూనృతుండ! 13

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావ స్తు ప్రవర్తతే.

ఈశుఁ డెప్పుడు కర్తృత్వ మెలమితోడ
కలుగఁజేయడు కర్మలన్ గలుగనీడు
కర్మఫలసిద్ధియును గూడఁ గలుగనీడు
ప్రకృతివల్ల నియ్యవి యన్ని ప్రభవమందె॥ 14

నాదత్తే కస్య చిత్పాపం నచైవ సుకృతం విభుః
అజ్ఞానే నాఽవృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః.

పుణ్యపాపంబులను సదా పుడమియందు
ఆత్మగ్రహియింపనేర దో యర్జునుండ!

కప్పఁబడియుండు జ్ఞాన మజ్ఞానమునను
దానిచేతను జంతువుల్ దాగ్ధ్యముగను
మోహమందుచునున్నవి ముఖ్యముగను॥ 15

జ్ఞానేన తు త దజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవ జ్జ్ఞానం ప్రకాశయతి తత్పరం.

ఆత్మజ్ఞానంబుచేత నో యర్జునుండ!
యఖిలజీవుల యజ్ఞాన మంతరించు
వారిజ్ఞానంబు సూర్యునివలెను భువినిఁ
బ్రకటనం జేయుఁ బరమాత్మఁ బ్రాభవముగ॥ 16

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః।
గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః.

జ్ఞాననిర్ధూతకల్మషులైనవారు
బ్రహ్మరూపాన బుద్ధినిఁ బరగనుంచి
యాత్మరూపంబుగా దాని యనిశ మెంచి
దానియం దతినిష్ఠముఁ దనర గలిగ
తిరుగ, రానట్టి మోక్షమా డెరవు గాంత్రు। 17

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః.

వినయ విద్యాదులును గల విప్రునందు
గోవునందున గజముల గుంపునందు

శునకములయందు ఫల్గునా! శునకమాంస
భక్షణంజేయు చండాల వర్గమందు
పండితులు సమదృష్టితోఁ బరగు చుంద్రు 18

ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్ బ్రహ్మణి తే స్థితాః

ఎవరి చిత్తంబు బ్రహ్మమం దేమఱకను
నిశ్చలంబయి యుండునో, నియతితోడ
వారిచేఁ బార్థ! మోక్ష మీ భవమునందె
జితము, తాదృశబ్రహ్మంబు శ్వేతవాహ!
యేకమై దోషరహితమై యెసఁగు కతన
బ్రహ్మమందున్న వారలు వారు సుమ్మ॥ 19

న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చాఽప్రియమ్
స్థిరబుద్ధి రసంమూఢో బ్రహ్మవిత్ బ్రహ్మణి స్థితః.

బ్రహ్మమందున్న యా పరబ్రహ్మవిదుఁడు
భ్రమను వదలుచు స్థిరబుద్ధిఁ బరగఁ గాంచి,
యిష్టమం దనురక్తి యనిష్టమందు
దుఃఖముఁ బొందనేరడు తోయజాక్ష! 20

బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని య త్సుఖమ్
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే.

బయటఁబుట్టిన శబ్దాది పటలమందు
నంటరానట్టి యాత్ముఁడై యాత్మయందు

నెట్టి సుఖమును బొందునో యట్టివాడు
బ్రహ్మమందు వినిర్మల స్వాంతుఁ డగుచు
నాశనములేని సుఖమును నందుచుండు॥ 21

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే
ఆద్యంతవంతః కౌంతేయ! న తేషు రమతే బుధః.

అర్జునా! యోయి! విషయేంద్రియములవలనఁ
బుట్టి సుఖములు నాద్యంతములును గలవి
కనుక నా భోగముల్ దుఃఖకారణములు
గాగ నెఱుగుము వాస్తకై కంజనేత్ర!
బుధులు నాసక్తులును గారు పుడమియందు॥ 22

శక్నో తీహైవ యః సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం స యుక్త స్స సుఖీ నరః.

ఎవ్వఁ డీ దేహమున్ ద్యజియించుటకును
మున్ను కామాదిగుణముల మోసమునకు
లోనుగాక జయించునో వాని వాఁడె
యోగియై పరమానంద భోగియగును॥ 23

యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాఽన్తర్జ్యోతిరేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి.

ఆత్మసుఖియౌచు సర్వదా యలరు నెవఁడు
ఆత్మయొకటిగె యారామమనునో యెవఁడు

జ్ఞానరూపిమై యంతః ప్రకాశుఁడైవడు
వాడె మోక్షముంబొందును వసుధయందు॥ 24

లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః.

అర్జునా! పాపవర్జితుఁలైన ఋషులు
సందియములేని యాత్ములై సకలజీవు
లందు దయఁజూపి, సర్వేంద్రియముల సతము
నిగ్రహించుచు, మోక్షము నొమ్మిగాంత్రు. 25

కామ క్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితా త్మనామ్.

కామకోపంబుల నీడ్డి ఘనత విడచి
చంచలముకాని చిత్తాన సంచరించి
యాత్మరూపంబు దెలిసిన యనఘమతులు
ఉభయలోకంబుల ముక్తి నోయి గాంత్రు! 26

స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాం శ్చక్షు శ్చైవాంతరే భ్రువోః.
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ.
యతేంద్రియమనోబుద్ధి ర్మని ర్మోక్షపరాయణః
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః.

శబ్దరూపాది విషయముల్ చక్కగాను
నింద్రియములకు వెలిగాక నెలమిఁ జేసి,
దృష్టి భ్రూమధ్యమున నిల్పి తృష్ణ వీడి

పార్థ! ప్రాణాదివాయువుల్ పరగ నెపుడు
నాసికాద్వారములయందు నయముగాను
సంచరించెడునట్లుగాఁ సమము చేసి.

మనసు బుద్ధిని స్వాధీనమందు నునిచి
భయము క్రోధము న్విడిచినవాడు నగుచు,
ముక్తిఁ గోరుచు నెవ్వాడు పుడమి కలఁడొ
వాడు ముక్తుఁడే సర్వదా పార్థ! వినుము॥

భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోకమహేశ్వరమ్
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి.

యజ్ఞ తపముల నోక్తగా నర్జునుండ!
సర్వలోకంబునకు మహేశ్వరుని గాక
నన్ను నెఱిగినవారలు సన్నుతాంగ!
మోక్షముం జెందుచున్నారు ముఖ్యముగను॥

భగవద్గీతయందు కర్మసన్యాసయోగ
నైదవయధ్యాయము ముగిసెను.

---

ఆఱవ అధ్యాయము

# ఆత్మసంయమయోగము



అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్నచాక్రియః.

ఎవడు కర్మఫలం బపేక్షింపకుండఁ
జేయఁదగినట్టి కర్మను జేయు నెపుడు
వాడె సన్యాసియోగియై వసుధఁ బరగు
నతఁడు అగ్నులు లేనట్టి యతఁడు కాడు
క్రియలు లేనట్టి యాతడు క్రీడి! కాడు॥ 1

యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ !
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన.

పార్థ!సన్న్యాస మని దేని పల్కుచుంద్రో
దాని కర్మయోగంబని దనర నీవు
తెలియు మర్జున! యొకడును, నిలను విడువఁ
బడని సంకల్పమును గలవాడు కర్మ
యోగి కాడని తెలిసి, విరాగి వగుము॥ 2

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే.

జ్ఞానయోగముఁ గోరిన మౌని కెప్పుడు
కర్మసాధన మనియును గరము చెప్పఁ

బడుచునున్నది జ్ఞానముఁ బడసినట్టి
మునికి, శాంతిసాధనమని పుడమి యందుఁ
బలుకఁబడుచుండె నరునా! ప్రథితముగను॥ 3

యదా హి నేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే.

ఎప్పుడు శబ్దాదికములైన యింద్రియార్థ
విషయములయందు నస్జునా! వీతరాగుఁ
డగునో యప్పుడు సకలేంద్రియములఁ బుట్టు
నఖిల సంకల్పముల వీడి నట్టి వాఁడు
గాను, యోగముఁ బొందిన ఘనుడుగాను
జెప్పఁబడుచుండె ధాత్రిలో శ్వేతవాహ!

ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః.

ఆత్మచే నుద్ధరింపంగఁ నగును తనున్న
అర్జునా! చెడగొట్టరా దాత్మ నెపుడు
తనకు బంధువు హృదయంబు తథ్య మిదియ
తనకు శత్రువు చిత్తంబు ధరణియందు॥

బంధు రాత్మాత్మన స్తస్య యేనాత్మైవాత్మనా జితః
అనాత్మన స్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్.

ఎవడు మనసుచేత నింద్రియవర్గమున్
తనయధీనమందుఁ దనర నుంచు

వాని కద్ది యెపుడు వసుధలో నుపకారి
యగును, లేనివాని కదియ రిపువు॥ 6

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానాపమానయోః.

ధీర! సకలేంద్రియములు స్వాధీనమందు
నుంచి, శాంతినిఁ బొందిన పంచజనుడు
విష్ణురూపుఁడై యుండి శీతోష్ణములను
దుఃఖసుఖములయందు నాతురుఁడు గాక
మానమందున నవమానమందుఁ గూడ
సమముగా జూచుచుండును సవ్యసాచి! 7

జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః.

జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముఁ డైనవాడు
చంచలముగాని యింద్రియచయము గలిగి
స్వర్ణమృత్తిక పాషాణ వర్గములను
సమముగాఁ జూచు, నాతఁడు జ్ఞానియనుచుఁ
జెప్పబడుచుండెఁ బుడమిలో నొప్పుగాను॥ 8

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే.

1 అరులయందున మిత్రులయందు నెవడు
2 బంధువులయందు ద్వేష్యుడౌ వానియందు

4 పాపులందున మధ్యస్థవర్గమందు
5 సాధువులయందు సమబుద్ధి జరుపువాడు
3 పక్షపాతంబు లేనట్టి వాని యందు
6 యోగి యని చెప్పఁబడుచుండె నుర్వియందు॥ 9

యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః.

ఆత్మధ్యానంబుగల యోగి యర్జునుండ
నిశ్చయమనశ్శరీరాల నెగడుచుండి
కోరికలు వీడి యాదానదూరు డగుచు
నొంటరిగ రహస్యంబున నుండి, మనసు
నిగ్రహింపగవలయును నియతితోడ॥ 10

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్.

మిగుల యెత్తును గానట్టి మిగులపల్ల
మైనఁ గానట్టి పరిశుద్ధమైన జగతి
మొదట దర్భాసనంబును పిదప పార్థ!
నల్లనైనట్టి చర్మంబు, తెల్లనైన
వస్త్రమున్ దానిపై వేయవలెను సుమ్ము॥ 11

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాఽసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే.

అట్టి స్థిరమైన యాసనమందు నుండి
నిశ్చలంబుగ బుద్ధిని నిలిపి, యింద్రి
యముల నిగ్రహముం జేసి యర్జునుండ!
యాత్మ పరిశుద్ధికొఱకునై యనుదినంబు
యోగమును జేయవలయును యోగి యెపుడు. 12

సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్.

తనదు దేహముఁ మెడయును దనదు శిరముఁ
జక్కగా నిల్పి, స్థిరచిత్తసరణిఁ గనుచు,
దిశలుచూడక, నాసిక దిక్కు చూచి
చూపు నిలుపంగవలయును నేపు మీఱ॥ 13

ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారి వ్రతేస్థితః
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః.

మిగుల శాంతాత్ముఁడై పార్థ! మెలగుచుండి
భయములేనట్టి వాడయి బ్రహ్మచర్య
వ్రతముకలవాడు నగుచును స్వాంత మెపుడు
దృఢముగానించి, నాయందె దృష్టినుంచి
నన్నె భావింపవలయును సన్నుతాంగ! 14

యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి.

నిశ్చలంబైన మనసుచే నెగడు యోగి
స్వీయచిత్తముఁ సర్వదా చేష్ట లుడిగి
నటుల గావింప నాయధీనమున నున్న
మోక్షసుఖమును బొందును పురుషసింహ! 15

నాత్యశ్నత స్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున!

అధికభక్షణ చేసెడు నట్టివాని
కల్పభక్షణ చేసెడు నట్టివాని
కధిక నిద్రను బోయిన యట్టివాని
కర్జునా! లేద? యీ యోగ మవనియందు॥ 16

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా.

మితమగు నాహారంబును
మిత నిద్రయు మితముగాఁగ మేలుకొనుటయున్
మితసంచారము చేసిన
సతతము నీ యోగ మబ్బు జగతి నరునకుఁ॥ 17

యదా వినియతం చిత్త మాత్మ న్యేవావతిష్ఠతే
నిస్స్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా.

మనసు స్వాధీనముంజేసి కొనుచు నెప్పుడు
నాత్మ పరమాత్మ సంధాన మమరఁ జేసి

వాంఛ లన్నింటి కెప్పుడు వశుడు గాక
యుండు నాతఁడు యోగియై యుర్విఁ బరగు॥ 18

యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః.

గాలి లేనట్టిచోటునఁ గదలకుండ
దీపమెట్టుల నుండునో దీప్తితోడ
నటులె యాత్మయోగంబున నధికుఁడైన
యోగి కా నిష్ఠ దృష్టాంత భాగ మగును॥ 19

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవాత్మనాత్మానం పశ్య న్నాత్మని తుష్యతి.

ఏ యవస్థయందు మనసు ప్రాయికముగ
యోగమాచరించుటచేత నోయి! నిగ్ర
హింపఁబడినదై యుపరతి నెప్పుడు పొందు
చున్నదో, యే యవస్థయం దున్న మనసు
చేత పరమాత్మ దర్శించి చిత్తమందు
సతత మానందమందునో! సవ్యసాచి! 20

సుఖ మాత్యంతికం య త్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః.

ఏ యవస్థయందును పార్థ! యింద్రియముల
కెపుడు గోచరముఁగాక యుద్ధరణిని

బుద్ధికిఁ గ్రాహ్యమైనదై పొడమునట్టి
యే సుఖం బిల కలుగునో యా సుఖంబుఁ
దెలియుచున్నాఁడొ యే యోగి తెలివి గలిగి
వాఁడు చలియింపకుండు తత్త్వంబునుండి॥ 21

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాఽధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే.

ఎట్టి లాభంబు నొందియు నింతకంటె
నితరలాభంబు హెచ్చుగా నెంచ డెవఁడొ
ఎట్టి లాభంబు పొందిన నెదను వెనుక
నెంత దుఃఖము వచ్చిన నుంతయేని
సంచలింపక యుండునో సవ్యసాచి! 22

తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా.

దుఃఖసంయోగమున్ సదా దూరముంచు
దీని, యోగం బటంచును దెలియ వలయు
నట్టి యోగంబు నిస్సంశయాత్మచే, వ్య
సనమునకు లోఁబడనియట్టి మనసుచేతఁ
గూర్పఁదగినది యోగంబు కుంతిపుత్ర! 23

సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః.

పార్థ! సంకల్పమువలన ప్రభవమైన
సర్వకామంబుల న్వీడి సర్వసంకల్ప
మైన చిత్తంబుతో సదా యఖిలయింద్రి
యముల స్వాధీనమందుంచి యనఘ! యోగ
మభ్యసింపంగవలయును ననవరతము॥ 24

శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్.

దార్ఢ్యమైనట్టి బుద్ధిచేఁ దనర మనసు
నాత్మయందున్న దానిగా ననఘ! చేసి
సుంతయేనియు వేఱొక చింత విడచి
యోగి మెల్లన యుపరతి నొందవలయు॥ 25

యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశం నయేత్.

అస్థిరంబయి చంచలంబైన చిత్త
మేవిషయముల సంచార మెప్పుడుచేయు
దాని విషయంబు లందుండి ద్రాని త్రిప్పి
యాత్మయందుండు విధముగా ననఘ! చేసి
కొనగవలయును ధారుణి మనగవలయు॥ 26

ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్

శాంతిఁ జెందిన మానస సత్త్వ గలిగి
క్షీణమైన రజోగుణ చింత గలిగి
బ్రతుకుచుండియె ముక్తిని బడయుచుండి
పాపరహితుఁడౌ యోగిని పరమమైన
హర్షమొందుచు నున్నది యర్జునుండ! 27

యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే.

పైని చెప్పిన తీరున పార్థివుండ!
యెల్లకాలములందున నుల్ల మెపుడు
నిలిపి, పాపరహితుఁడయి నిశ్చయముగ
యోగి సుఖముతోఁ బరమాత్మ నొంది పిదప
నిందు సంతోషముగా బొందుచుండు నోయి! 28

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.

అన్నిప్రాణుల సమముగా నరయువాడు
యోగయుక్తమా యాత్మతో నుండునతడు
అన్నిభూతంబులందున తనను జూచు
నఖిలభూతంబులను తనయందుఁ జూచు॥ 29

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి.

ఎవఁడు సర్వభూతములందు నెపుడు నన్ను
చూచుచుండునో, నాయందుఁ జోద్యముగను
నఖిలభూతంబులను నెపు డరయుచుండొ
వానికిని నేను నాకును వాఁడు సతము
చూచుచుందుము పార్థివా! సులభముగను॥ 30

సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే.

యోగి యెవ్వాఁ డభేదంబు నొందుచుండి
సర్వభూతములందున సాక్షి నగుచు
నున్న నన్ను సేవించునో సన్నుతాంగ!
యట్టి వాఁ డఖిలప్రకారాంతరముల
నుండువాడైన నాయందె యుండు నెపుడు॥ 31

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః.

పార్థ! యెవ్వాఁడు సర్వప్రపంచమందుఁ
బరగు భూతాల సుఖదుఃఖపటల మెపుడు
స్వీయసుఖదుఃఖచయముగాఁ జిత్తమందుఁ
జూచునో, వాఁడు సుజ్ఞాని సుమ్ము జగతి॥ 32

యోఽయం యోగ స్త్వయా ప్రోక్త స్సామ్యేన మధుసూదన!
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్.

చిత్త మస్థిరమగుటచే శ్రీనివాస!
నీవు చెప్పిన యోగంబు నియతముగను
సాధ్యముంగాక యున్నది సరగ నిపుడు
దీని దృఢమైననిలకడ గాన నేను॥ 33

చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవ ద్దృఢమ్
తస్యాఽహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్.

స్థిరముకానిది యగుచును జిక్కు లెపుడు
పెట్టుచుండియు మిక్కిలి గట్టిదగుచుఁ
జిత్తమున్నది దీనిని శ్రీనివాస!
గాలివలె నధీనంబును గాదు చేయ॥ 34

అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే.

గొప్పభుజములు గలవాడ! కుంతిపుత్ర!
చంచలము మన మనుట నిశ్చయము సుమ్ము
అభ్యసించుటచే విరాగగుటచేత
నట్టి చేతము స్వాధీన మగును పుడమి॥ 35

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః.

అస్థిరంబైన చిత్తాన నలరువాడు
యోగ మనునది పొందలే డుర్వియందు

మనసు తన యధీనమం జేయు మనుజుఁ డెపుడు
యత్నముంచేసి యోగియై యలరుచుండు! 36

అయతి శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి?

శ్రద్ధతోఁ గూడుకొను పంచజనుఁడు కూడ
నియమమును లేనివాడయి నేర్పులేక
చలితమానసుఁడై యోగచలన మందు
నట్టి వా డేమిగతినొందు? ననఘ! కృష్ణ! 37

కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి?
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి.

మాధవా! యోయి! పరమాత్మ మార్గమందు
మూఢుడై నిరాశ్రయుఁడైన పురుషుఁ డెపుడు
కర్మముననుండి జ్ఞానమార్గమున నుండి
భ్రష్టుడగుచును చెదరి నాబ్దంబువోలె
చెడకయుండునా దీనిని జెప్పుమయ్య॥ 38

ఏత న్మే సంశయమ్ కృష్ణ! చ్ఛేత్తుమర్హ స్య శేషతః
త్వదన్య స్సంశయస్యాఽస్య ఛ్ఛేత్తా న హ్యుపపద్యతే.

చక్రధర! నాకుఁ గలిగిన సంశయమును
మిగతలేనట్లుగావింపఁ దగుదు వీవె
ఇట్టి సందేహముం బాప నీవు తక్క

వేరొకండును దొరకడు విశ్వమందు॥ 39

పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి.

పార్థ! వివరింతు నాయోగపతనునకును
మర్త్యలోకాన పరలోకమందుఁ గూడ
నాశనములేదు నాయనా నమ్ము మీవు
మంగళముచేయునట్టి యా మనుజుఁ డెపుడు
పొందనేరడు దుర్గతిఁ బుడమియందు॥ 40

ప్రాప్య పుణ్యకృతాఀ లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.

యోగమందుండి జారిన యుర్విజనుఁడు
పుణ్యవంతుల లోకాలఁ బొంది యచట
పెక్కువర్షముల్ నివసించి, పేరుఁగన్న
ధనికులిండ్లలోఁ బుట్టును ధరణియందు॥ 41

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం.
ఏత ద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశం.

అట్లుకానిచో ధీమంతులైన యట్టి
యోగి వంశాన జన్మంబు నొందుచుండు
ఇట్టి పుట్టుక లోకాన నెంచిచూడ
పొందశక్యము కానిది పుడమియెడ! 42

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన!

కుంతిపుత్రుండ! యా యోగి కులమునందు
పూర్వదేహానఁ బుట్టిన బుద్ధి నెపుడు
పొందుచున్నారు, పిమ్మట పూర్వమున్న
జన్మసంస్కారమువలన జ్ఞానసిద్ధి
కొఱకు యత్నించుచున్నాఁడు కుతలమందు॥

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే.

యోగమందున భ్రష్టుఁడై యుండువాఁడు
పూర్వజన్మంపు టభ్యాసముండు కతన
నవశుఁడైనను విషయేంద్రియముల కెపుడు
లోనుగాకుండు, యోగస్వరూప మెపుడు
తెలియఁగోరినయట్టి నా డిలను వేగ
ప్రకృతిదాటినవాడయి పరగుచుండు॥ .

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్.

జ్ఞాననిష్టుండు యత్నముఁ కరము చేయు
చున్నవాఁడయి, పిమ్మట శుద్ధమైన
పాపముంగలవాడయి బహుళమైన
జన్మసంస్కారసిద్ధినిఁ జక్కఁబడసి
మోక్షముం బొందుచున్నాఁడు పుడమియందు॥

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవాఽర్జున!

అర్జునా! యోగియైనట్టి యతఁడు కర్మ
నిష్టగలవారికంటెను శిష్టుఁ డెప్పుడు
తాపసులకంటె శాస్త్రార్థతత్త్వవేత్త
లైనవారలకంటెను నధికుఁ డతఁడు
కాన నీవును యోగివి కమ్ము పుడమి॥ 46

యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః

ఎవఁడు విశ్వాసమును గల్గి యివ్వసుధను
నన్ను సేవించి, నాయందు సన్నుతముగ
సక్తమైనట్టి మనసుతో సరిగనుండు
నతఁడు యోగులకంటెను నధికతముఁడు
నాకు సమ్మతుఁడుఁ గూడ నర్జునుండ!

భగవద్గీతయందు నాత్మసంయమయోగ మనెడి యాఱవ యధ్యాయము ముగిసెను.



# ఏడవ అధ్యాయము

## విజ్ఞానయోగము



మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథాజ్ఞాస్యసి తచ్ఛృణు.

అర్జునా! నీవు నాయందు స్వాంతముంచి
యోగముం జేయుచుండియుఁ ద్యాగి వగుచు
నేనె యాశ్రయ మనుచును నిఖిలసుగుణ
పూర్ణుఁడ నగు నన్నెట్టుల మున్న తెలియ
గలవు, దానినిఁ దెల్పెద కరము వినుము॥ 1

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః
యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే.

అనుభవజ్ఞానసహితమై యలరునట్టి
శాస్త్రజంబైన యెఱుకయు సరిగ నీకు
నేను లలరంగఁ దెల్పెద విస్తరముగ
దీని నెఱిగినచో నీవు దెలియఁదగిన
వేరువిషయంబు లేదయా విశ్వమందు॥ 2

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః.

వేల జనులలో నొక్కఁడు విశ్వమందు
జ్ఞానసిద్ధికై యత్నంబు పూని సతము
చేయుచున్నాడు, వారిలో వేయి కొకడు
నన్నుఁ దెలియుచునున్నాడు సన్నుతాంగ! 3

భూమి రాపో౽నలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.

వసుధ జలమును నగ్నియు పవనములును
గగనము మ్మనో బు ధ్యహంకార మనెడు
నాదు మాయయె యెనిమిది భేదములుగ
నలరుచుండెను పుడమిపై నర్జునుండ! 4

అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో! య యేదం ధార్యతే జగత్.

పైనఁ జెప్పిన నా మాయ ప్రథితముగను
నీచమైన దటంచును నెఱుగుమయ్య
దీనికంటెను నుత్కృష్టమైన ప్రకృతి
యింకొకటి యున్నదనుచును నెంచుమయ్య
దానిచే నీ జగంబును ధార్య మయ్యె॥ 5

ఏతద్యోనీని భూతాని సర్వా ణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా.

ప్రకృతియే సర్వభూతంబులకును ముఖ్య
కారణంబని తెలియుము కరము నీవు

సర్వజగమున కుత్పత్తి స్థాన మేను
లయము నొందింప మిగుల కారణము నేన॥ 6

మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ!
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.

కారణం బింక నొకటి నాకంటె లేదు
పార్థ! విను మీవు సర్వప్రపంచచయము
దారమందున రత్నవితతియుఁ బోలె
కూర్పబడియున్న దంతట నేర్పుతోడ॥ 7

రసోఽహ మప్సు కౌంతేయ! ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు.

ఉదకమందున రసమయి యుందు నేను
చంద్రసూర్యులలోఁ బ్రకాశంబు నేను
పార్థ! వేదాలలోఁ బ్రణవంబు నేను
గగనమందున శబ్దంబుగాగ నుందు
పంచజనులందుఁ బురుషప్రభావ మేను॥ 8

పుణ్యో గంధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు.

అవనియందు సుగంధంబునగుదు నేను
అగ్నియందునఁ దేజంబునగుదు నేను
అన్నిభూతంబులందున నాయు వేను
మౌనులందునఁ దపసును నేన యగుదు॥ 9

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్

సర్వభూతంబులందు బీజంబుగాను
బుద్ధిమంతులయందున బుద్ధిగాను
కాంతికలవారియందునఁ గాంతిగాను
నగుదునని నీవు తెలియుమో యర్జునుండ! 10

బలం బలవతా మస్మి కామ రాగ వివర్జితమ్
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ!

అర్జునా! బలవంతులయందు కామ
రాగములు లేని బలమును గాగ, మఱియు
ధరణిఁ బ్రాణులయందున ధర్మశాస్త్ర
మునకు వ్యతిరేకమునుగాక పుడమిఁ బరగ
కామమును నేన యందును గనుము నీవు॥ 11

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసా శ్చ యే
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి.

సత్త్వగుణరూపములు నైన శమదమాదు
లమరజోగుణరూపము లైన గర్వ
హర్షమాదిగాఁగలవియు నర్జునుండ!
తామసగుణరూపంబులై తనరు శోక
మోహ మాదిగాఁ గలవియు పుడమిరేడ!
నాకుఁ బుట్టినవానిగా నరయుమయ్య

వాని కేను స్వాధీనంబు కాను సుమ్ము
అవ్వి నాకు నధీనంబు లగుచునుండు॥ 12

త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్.

పైనఁ జెప్పిన సత్వాది భావములచె
మోహముం జెంది యున్న దీ భువన మెపుడు
వీనికంటెను పరుఁడనై వికృతులకును
దూరుఁడౌ నన్ను నెఱుఁగ దపారగుణుడ॥ 13

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే॥

మూడుగుణములతోఁ గూడఁ బుట్టియున్న
మామకంబగు నీ మాయ మనుజు లెపుడు
దాటలే రర్జునా! నన్నె తథ్యముగను
శరణఁ బొందిన వార లీ జగతిలోన
దాటగల్గుదు రీ మాయ ధరణినాథ! 14

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః.

అధికపాపంబు చేయు మూఢాత్ములైన
మానవాధముల్ నాదగు మాయచేత
జ్ఞానశూన్యులై రాక్షసజాతు లగుచు

హేయకృత్యముల్ జేయుచు హీను లగుచు
నన్ను సేవింపనేరరు సన్నుతాంగ! 15

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జునా!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!

ఆర్తులును జ్ఞానవంతులు నర్థమందు
కాంక్ష కలవారు జ్ఞానేచ్ఛ కలుగువారు
నాల్గువిధములుగా జనుల్ నన్ను నెప్డు
సేవచేయుచునుందురు శ్వేతవాహ! 16

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః.

పైనఁజెప్పిన నలుగురిలోన నిత్య
యోగియైనట్టి వానికి నోయి! ముఖ్య
భక్తిగలయట్టివానికిఁ బరగ నేను
అధికమైనట్టి యిష్టుడ నగుదు వాడు
నాకు మిక్కిలి ప్రియుఁడును నగును సుమ్ము॥ 17

ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్
ఆస్థిత స్స హి యుక్తాత్మా మా మేవానుత్తమాం గతిమ్.

వీరు నలుగురు మిగుల యుదారు లెప్పుడు
ఐన నందులో జ్ఞానిని నేనె యనెడి
మతము నాయది వాడును మానసమును

స్థిరముగా నుంచి నేనె యా శ్రేష్ఠమైన
గతియటంచును నమ్మిక గాంచుచుండు! 18

బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః.

పుడమి పెక్కులౌ జన్మలు పొంది పిదప
జ్ఞానియై వాడు సర్వము చక్రధరుఁడె
యనుచు, నాదగు శరణను ననుదనంబు
పొందుచున్నాడు తాదృశపురుషుఁ డెప్డు॥ 19

కామైస్తైస్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్య దేవతాః
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా.

ఆత్మ ప్రకృతిచే నియమితులైన జనులు
కామములచేత నపహృత జ్ఞాను లగుచు
కోరికల నిచ్చు దేవతల్ గూర్చి నియమ
ముల నొనర్చు, శరణను పొందుచుంద్రు॥ 20

యోయో యాంయాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్.

ఎవ్వ డేకోరికలచేత నెట్టి దేవ
తలను భక్తితో శ్రద్ధతో గొలుచు నెప్డు
వానివానికి నట్టి దేవతలయందు
భక్తియును శ్రద్ధయున్నట్లు పరగఁ జేతు॥ 21

స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్.

అట్టిమనుజుఁడు శ్రద్ధతో నట్టి దేవ
తలను బూజించుచున్నాఁడు ధవళగాత్ర!
ఉర్విఁ బూజించి నాచేత నొసగబడిన
కోరికల నందుచున్నాఁడు కుతలమందు॥

అంతవ త్తు ఫలం తేషాం త ద్భవ త్యల్పమేధసామ్
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి.

అన్య దేజేల పూజించు నట్టివారు
వారి విబుధుల స్థానాలఁ బడయుచుంద్రు
అల్పబుద్ధుల కోరిక లంత మొందు
నాదు భక్తులు పొందుచున్నారు నన్ను॥ 23

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః
పరం భావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్.

వ్యక్తమునుగాని నన్ను నీ యల్పబుద్ధు
లెపుడు వ్యక్తుండనని నన్ను నెంచుచుంద్రు
నాదు గొప్పతనంబునుం దనర నెఱుఁగ
నట్టి వారలు నాశంబు నాకుఁ గలదు
అనుచుఁ దలచెద రర్జునా! యవని యందు॥ 24

నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్.

సకలలోకంబునకు ప్రకాశకుఁడ నేను
జ్ఞానశూన్యంబులైన యీ జగము సతము
మాయచేఁ గప్పబడినదై మమతగలిగి
పుట్టుకయు నాశమును లేని మూర్తినైన
నన్నుఁ దెలియంగఁజాలరు సన్నుతాంగ॥ 25

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున!
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన.

జరిగిపోయిన కాలాన జరుగుచున్న
కాలమందున రాబోవు కాలమందు
నున్న ప్రాణిజాలంబును నెన్న నేన
ఎఱుఁగజాలుదు నన్నొక డెఱుగ లేడు॥ 26

ఇచ్ఛా ద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత!
సర్వభూతాని సంమోహం సర్గే యాంతి పరంతప!

శత్రుతాపనుఁడైన యో సవ్యసాచి!
ద్వేషవాంఛల బుట్టిన ద్వివిధరూప
మైన సుఖదుఃఖములయందు పూని యెవడు
మోహమందుటచేతను పుడమినెల్ల
ప్రాణు లజ్ఞానయుతులయి పరగుచుంద్రు॥ 27

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః.

పుణ్యకర్మలు గలిగిన పురుషవరులు
పాపములు నశించినయట్టి వార లగుచు
ద్వంద్వమోహాదు లెప్పుడు వసుధ వీడి
చంచలముకాని నియమంబు, సరిగ పొంది
నన్నుఁ గొలుచుచున్నారు, సన్నుతాంగ! 28

జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతియే
తే బ్రహ్మ త ద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్.

చావు పుట్టుకల్ లేని మోక్షాశ తోడ
నన్ను సేవించి యెవ్వారు సన్నిధులయి
యత్నముం జేయుచుందురో యట్టివారు
బ్రహ్మమును సర్వకర్మను, పరగఁ దెలిసి
కొనుచునున్నారు ఫల్గుణా! క్షితలమందు॥ 29

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః
ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః.

అధిదైవము నాధిభూ తాధియజ్ఞ
ములును నారూపమంచును పుడమి నెవరు
తెలియుచుందురో వారలు తెల్లముగను
అంత్యకాలమునందున ననఘ! నన్ను
తెలిసికొందురు బాగుగా స్థిరు లగుచును॥ 30

విజ్ఞానయోగ మనెడి యేడవ యధ్యాయము ముగిసెను.

ఎనిమిదవ అధ్యాయము

# అక్షరపరబ్రహ్మయోగము

కిం తద్ బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ!
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే?

ఏది బ్రహ్మంబు నధ్యాత్మ మేది కృష్ణ!
ఆదిభూతాధి దైవంబు లనఁగ నెవ్వి?
కర్మ మెట్టిది? యద్దాని కరము నాకు
వివరమగునట్లు తెల్పుము నీవు లలర॥ 1

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన!
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః

అంబుజోదర! యీ దేహమందు నున్న
అధియజ్ఞుండు నెవ్వఁడు? అతఁడు మఱియు
నెటుల తెలియఁదగినవాఁడు? నియతమైన
స్వాంతమును గలవారిచే నంత్యకాల
మందు నీవెట్లు తెలియంగ నగుదువయ్య॥ 2

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః

పరమ మగు బ్రహ్మ మెప్పుడు క్షరముకాదు
ప్రకృతి యధ్యాత్మమనుచును బలుకఁబడియె

భూతములయొక్క యుత్పత్తి పుడమిఁ జేయు
నట్టి దానంబు కర్మమయం చనిరి బుధులు॥

అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాంవర!

చచ్చు భావంబు గల చరాచరము లెల్ల
పరగ నధిభూతమంచును పల్కబడియె
అర్జునా! నరుఁ డధిదైవ మనగఁ బరగు
దేహము ల్దాల్చు వారల దేహమందు
నేన యధియజ్ఞుఁ డౌచును నెగడుచుందు॥

అంతకాలే చ మా మేవ స్మర న్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః

అంత్యకాలంబునందున నవని యెవడు
నన్నుధ్యానంబుచేయుచు నాదు నామ
ములను స్మరియించి దేహంబు పుడమి విడుచు
వాడు నాదగు రూపంబు పరగపొందు
ఇందు సందేహ మించుక యేని లేదు ॥

యం యం వాపి స్మరన్ భావం త్యజ త్యంతే కళేబరమ్
తం త మే వైతి కౌంతేయ! సదా తద్భావభావితః.

పురుషు లెట్టి దేవుళ్లను పుడమియందు
చంచలముకాని మనసుతో సంస్మరించి

యంత్యకాలాన దేహము నవనియందు
వదలుచుందురో వారలు పరగనట్టి
దేవతలఁ జెందుచున్నారు ధీర! వినుము॥ 6

తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ
మ య్యర్పితమనోబుద్ధి ర్మా మే వైష్య స్యసంశయః.

అందుచే సర్వకాలంబులందు నీవు
నన్ను స్మరియించి యుద్ధంబు సన్నుతముగ
చేయు మర్జునా! యట్టులఁ జేయ నీవు
పొందుదువు నన్ను తప్పక పుడమిపైని॥ 7

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్.

ఎవ్వఁ డభ్యాసయోగాన నితరములగు
చింతల న్వీడి చిత్తంబు స్థిరత గలిగి
దివ్యరూపుడౌ యల మహాదేవు నెపుడు
స్మరణచేయుచు నుండునో సరిగ వాడు
పరమపురుషుని జెందును;పార్థ! వినుము॥ 8

కవిం పురాణ మనుశాసితార మణో రణీయాంస మనుస్మరే ద్యః
సర్వస్య ధాతార మచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్.

పాలకుండగు సర్వప్రపంచమునకు
సూక్ష్మమైన యణువు కన్న సూక్ష్మరూపి

యుర్వీజనులకు ఫలమును నొసగువాడు
ఊహకందని రూపుఁడై యుండువాఁడు
భాస్కరునివంటి కాంతితోఁ బరగువాఁడు
ఆద్యపురుషుండు చీకటి కావలుండు
అతఁడె పార్థివా! సర్వజ్ఞుఁడైనవాఁడు॥ 9

ప్రయాణకాలే మనసా ఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్యసమ్యక్ స తం పరంపురుషముపైతిదివ్యమ్

మరణకాలాన స్థిరమైన మనసుచేత
భక్తితోఁగూడ నా యోగబలముచేతఁ
గనుబొమలమధ్య లెస్సగాఁ బ్రాణవాయు
వుంచి, యెవ్వాఁడు పరునిధ్యానించు సతము
వాఁడె యామహాపురుషునిఁ బడయు సుమ్మ॥ 10

య దక్షరం వేదవిదో వదంతి విశంతి య ద్యతయో వీతరాగాః
య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి త త్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే.

పరగ వేదార్థ మెఱిగిన వార లెపుడు
దేని నాశంబు లేనట్టి దానిగాను
చెప్పుచున్నారొ యయ్యది గొప్పగాను
వీతరాగులై యింద్రియ జేతలైన
యతులు నెద్దానిఁ బొందుచు నలరుచుంద్రొ
పరగ నెయ్యది కోరిన వారలగుచు

బ్రహ్మచర్యవ్రతంబును పరగుచుంద్రో,
తాదృశంబైన నెలవును దనర నీకు
సంగ్రహముగను దెల్పెద సవ్యసాచి॥ 11

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్.

ఇంద్రియద్వారముల బిగియించి, మనసు
హృదయమందున నిల్పుచు వదల కెపుడు
స్వీయభ్రూమధ్యప్రాణముల్ చేర్చి యుంచి
యోగధారణచేయుట యుచితమగును॥ 12

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మా మనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్.

బ్రహ్మవాచకమగుచును బరగునట్టి
ఓమనెడి యక్షరంబును నుచ్చరించి
నన్ను దలచుచు దేహము న్నయముగాను
వీడు చున్నాడొ యెవ్వాడు వాడు జగతి
మోక్షమందుచునున్నాడు పుడమియందు॥ 13

అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః.

ఇతరవిషయములం బ్రవేశింపనట్టి
నిశ్చలంబైన మనసుతో నెగడుచుండి

నన్ను సర్వదా స్మరియించునట్టి యోగి
కెప్పుడు, నేను సులభుండ నో యింద్రతనయ!॥ 14

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః.

మంచిహృదయంబు గలిగిన మనుజు లెప్పుడు
యోగులై నన్నుఁ జెందుచు యోగ్యమైన
మోక్షమును జెంది, దుఃఖాలపుంజమునకు
స్థానమై, యస్థిరంబైన జన్మ తిరుగ
పొందనేరరు పార్థి నా! పుడమియందు॥ 15

ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున!
మా ముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే.

బ్రహ్మలోకంబుతోఁ గూడఁ బరగు సర్వ
భువనములు పునరావృత్తిఁ బొందుచుండు
పార్థ! నను జెందువారలు వసుధయందు
తిరుగ జన్మమునందరు తెల్లమిదియు॥ 16

సహస్రయుగపర్యంత మహ ర్యద్బ్రహ్మణో విదుః
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః.

వేయియుగముల మితిగల వేధయొక్క
పగలు, నంతయె మితిగల బ్రహ్మయొక్క
రేయియు నెవ్వా రెరుగుదురో సరిగ వారు
పగలు రాత్రియుఁ దెలిసిన వారు సుమ్ము॥ 17

అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వాః ప్రభవం త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే.

బ్రహ్మదేవుని కెయ్యది పగటికాల
మగునో, యందుచరాచరమైన జంతు
జాలములు పుట్టుచున్నవి చక్కగాను
రాత్రి రాగానె యా జీవరాసు లన్ని
లీనమగుచున్న వెప్పుడు దానియందె॥ 18

భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే
రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవ త్యహరాగమే.

సవ్యసాచి! యే భూతాల సముదయంబు
పుడమి వివశమై పలుమారు పుట్టి పుట్టి
పగలు రాగానె సర్వంబు ప్రభవమొందు
లీనమగుచుండె రాత్రి రాగానె యదియు 19

పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తా త్సనాతనః
య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి.

పై నుడివిన భూతమయ ప్రపంచములకు
కారణుండైన యీశ్వరు కన్న వేఱె
యగుచు, గొప్పదై వ్యతిరిక్తమైన దగుచు
శాశ్వతంబైన బ్రహ్మంబు సర్వభూత
ములు నశించిన యది నాశమొంద దెప్పుడు॥ 20

అవ్యక్తో౽క్షర ఇత్యుక్త స్త మాహుః పరమాం గతిమ్
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ.

ఏ పరబ్రహ్మ మెల్లప్పు డింద్రియముల
కగపడనిదంచు, నాశంబు కానిదనుచుఁ
జెప్పబడియెనో, దేనినిఁ జెంది వారు
తిరుగ జన్మము నొందరో ధరణియందు
అద్ది నాదగు ధామమం చరయవలయు॥ 21

పురుషః స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా,
యస్యాన్తఃస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్.

ఎట్టి పురుషునియందు నీ యెల్లలోక
ములును, లీనమైయుండునో పుడమియందు
నే మహాపురుషునివల్ల నెల్లలోక
ములును, వ్యాపించియుండునో పొంకుగాను
అట్టి యుత్కృష్టపురుషుని నధికమైన
భక్తిచేఁ బొందవచ్చును పార్థ! వినుము॥ 22

యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ!

యోగు లేకాలమందున నుర్వియందు
దేహము స్వీడి, సర్వదా తిరుగ జన్మ
పొందుచున్నారో, వారలు పొందుగాను
జన్మ లేకుండ నుందురో జగతియందు
నట్టికాలముం దెల్పెద యనఘ వినుము॥ 23

అగ్ని ర్జ్యోతి రహః శ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః.

వహ్న్యాదిగాఁగల దేవవర్గ మెపుడు
ఎట్టి మార్గాన నుందురో యట్టి మార్గ
మందు జనునట్టి యోగులు ఇందుఁ దిరుగ
జన్మ యనునది పొందక సరిగవారు
మోక్షమును జెందుచున్నారు పొందుగాను॥ 24

ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్,
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే.

ధూమ మాదిగాఁ గలిగిన దోషరూప
మైన మార్గానఁ జనునట్టి యఖిల యోగు
లెపుడు చంద్రలోకము జెంది యిద్ధరణినిఁ
దిరుగఁ బుట్టుచునుందురు పరములేక॥ 25

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే,
ఏకయా యా త్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః.

శుక్లకృష్ణాత్మకంబులై సూటులైన
శాశ్వతములైన యీరెండు సరణు లెపుడు
గలవు, వానిలో శుక్లాత్మకంబు తిరుగ
జన్మ కల దని తెలియుమో సవ్యసాచి! 26

నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మా త్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున!

పార్థ! యీ రెండు మార్గముల్ పరగఁ దెలిసి
నట్టియోగి మోహముజెంద డెట్టులైన

అందుచే సర్వకాలంబులందు నీవు
యోగయుక్తుండ వగుచును త్యాగివగుము॥ 27

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు య త్పుణ్యఫలం ప్రదిష్టమ్,
అత్యేతి త త్సర్వ మిదం విదిత్వా యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్.

అఖిల వేదములందున యజ్ఞకోటు
లందు దానములందున నసఘ! తపము
లందు నేపుణ్యఫల మది యధికమగుచుఁ
గలదొ యద్దాని యోగి దా నిలను వేగ
దాటుచున్నాఁడు దానిని దాటి యతఁడుఁ
ఈదృశంబైన యర్థంబు నెఱిఁగి, సతము
బ్రహ్మమును పొందుచున్నాఁడు ఫల్గుణుండ! 28

భగవద్గీతయందు అక్షరపరబ్రహ్మయోగ మనెడు
ఎనిమిదవ యధ్యాయము ముగిసెను.

## తొమ్మిదవ అధ్యాయము

# రాజవిద్యారాజగుహ్యయోగము

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞాన సహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.

ఎట్టి సుజ్ఞానమును సదా యెఱిగి నీవు
అశుభముననుండి మోక్షంబు నందగలవొ
యట్టి మిక్కిలి గోప్యంబు నైనదియును
అనుభవజ్ఞానజన్యమై యలరునదియు
నైన సుజ్ఞాన మీర్ష్యయు లేని నీకు
బాగుగాఁ దెల్పెదను విను పార్థ! యిపుడు॥ 1

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్.

పైనఁ జెప్పిన జ్ఞానంబు పరమపావ
నంబు, మిగుల మంచిదియును నాశమంద
నదియు, విద్య లన్నిట మిన్న యగుచునుండు
చేయుటకు సుఖమైనదై శ్రేష్ఠమైన
దగుచు ప్రత్యక్షబోధకం బగుచు వెలయు॥ 2

అశ్రద్ధ ధానాః పురుషా ధర్మ స్యాస్య పరంతప!
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని.

పార్థ! యీదృశధర్మంబు పరగ నమ్మ
నట్టి నాస్తికమానవుల్ నన్ను నెపుడు

పొందనేరక సర్వదా పుడమియందు
మృత్యురూపసంసారాన మెలగుచుంద్రు॥ 3

మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా
మత్ స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః.

సకలవిషయేంద్రియముల గోచరముగాని
మామకంబైన శక్తిచే మాన్యచరిత!
వ్యాప్తమైయున్న దీ జగమంత సుమ్ము
అన్నిలోకాలు నాయందు నణగియుండు
వానియందున నే నున్నవాఁడ గాను॥ 4

న చ మత్ స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్,
భూతభృ న్న చ భూతస్థో మమాత్మా భూతభావనః.

బ్రహ్మయాదిగాగల స్థావరాంత మగుచు
నున్న భూతాలు నాయందుఁ నుండ వెపుడు
ఈశ్వరాంశమౌ నాయోగ మిపుడు చూడు
మామకంబగు రూపంబు మహిని భూత
ములను భరియించునదియును భూతములను
వృద్ధిపొందించునదియును శ్వేతవాహ!
ప్రాణులందున నున్నది పరగ గాదు. 5

యథాకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ.

ఉర్వియంతట వ్యాపించి యున్న గొప్ప
వాయు వాకాశమందు నే పగది నుండొ

అటులె సర్వభూతములు నా యందు నున్న
వనుచుఁ దెలియుము సర్వదా యర్జునుండ! 6

సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం యాంతి మామికామ్
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్.

ప్రళయకాలంబునం దెల్ల ప్రాణిచయము
మామకంబగు ప్రకృతిలో మడియుచుండు
తిరుగ సృజియించుకాలాన పరగ భూత
ములను బుట్టించుచున్నాను పుడమియందు॥ 7

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్.

స్వీయమగునట్టి మాయను జెంది నేను
అస్వతంత్రమై యున్నట్టి యఖిలభూత
వర్గమును మాటిమాటికి వసుధయందు
సృష్టిగావించుచున్నాను శ్రేష్ఠముగను॥ 8

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ!
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు.

అట్టి కర్మలయందున ననఘ! నాకు
ప్రీతియును లక్ష్యమును లేదు పేర్మి లేదు
కాన నీదృశకర్మలు కరము నన్ను
బంధనముచేయఁజాలవు పార్థివుండ! 9

మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్
హేతునానేన కౌంతేయ! జగ ద్విపరివర్తతే.

సాక్షిగానుండు నాచేత సకలమైన
చరము లచరములంగూడు జగములెల్ల
ప్రకృతియందున నెప్పుడు ప్రభవమందు
పార్థ! నాచేత సర్వప్రపంచ మెప్పుడు
తిరుగుచున్నది యిద్దానిఁ దెలియుమయ్య॥ 10

అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్
పరం భావ మజానంతో మమ భూత మహేశ్వరమ్ .

ప్రాణులకు శాసకుండనై పరగునట్టి
తద్దయును గొప్పదైన నా తత్వ మెపుడు
తెలియలేనట్టి మూఢాత్ము లిలను నన్ను
మానవుండని తలఁచుచు మనములందు
లక్ష్యముం జేయకున్నారు లావు గలిగి॥ 11

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః.

పనికిమాలిన యాశలఁ బరగుచుండి
వ్యర్థకర్మలు కలవార లగుచు నుండి
వ్యర్థమగు జ్ఞానముం గలవార లగుచు
మూఢు లాసురమగునట్టి, మూర్తిఁ దాల్చి
పరగ మోహాత్మకంబైన ప్రకృతిఁ దాల్చి
నన్ను లక్ష్యముం జేయకున్నారు పార్థ! 12

మహాత్మాన స్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః
భజం త్యనన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్.

అర్జునా! గొప్పవారలై యలరువారు
దేవతాచింతచే సదా తేజరిల్లి
ప్రకృతినాశ్రయించిన వారలగుచు, భూత
కారణమగుచు నాశంబుకాని నన్ను
తెలిసికొని యన్యచింతల వలనుపోక
నన్ను సేవించుచున్నారు నయముగాను॥

సతతం కీర్తయంతో మాం యతంత శ్చ దృఢవ్రతాః
నమస్యంత శ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే.

ఇంద్రియంబుల జేతలై యెసగువారు
దార్ఢ్యమైనట్టి వ్రతముచేఁ దనరువారు
సర్వకాలంబులందున సరిగ నాకు
వందనంబులు జేయుచు భక్తిగలిగి
నన్ను సేవించుచున్నారు సన్నిధులయి॥

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్.

జ్ఞాన మనియెడు క్రతువుచే సవ్యసాచి!
నన్ను బూజించుచును సేవ నయముగాను
చేయుచుందురు “కొంద ఱమేయముగను
కొంద ఱేకత్వమున మఱికొంద ఱెప్పుడు
వేరు వేరను భావాన వేరె కొంద
ఱంతటను నిండియున్నాను” అనెడి భావ
మునను సేవించుచున్నారు పుడమిపైని॥

అహం క్రతురహం యజ్ఞస్స్వధాహ మహ మౌషధమ్
మంత్రోఽహ మహ మేవాజ్య మహ మగ్ని రహం హుతమ్.

యజ్ఞమును నేన క్రతువును, నగను నేన
పైతృకాన్నంబు నేనయై పరగుచుందు
నేన యోషధిన్మంత్రంబు నేన సుమ్ము
ఆజ్యమును, నగ్నియును, నేన యగుదు పార్థ!
హోమకర్మయు నేనయై యుందు నెపుడు॥ 16

పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజు రేవచ.

ఎల్లజగతికిఁ దల్లియుఁ దండ్రి నేన
కర్మఫలదాతఁ దాతయుఁ గరము నేన
పావనంబగు వస్తువున్ పరగ నేన
తెలియదగువస్తువును నేన ధీర! వినుము
పరగ వేదాల నోంకార వర్ణమేన॥ 17

గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజ మవ్యయమ్.

సర్వకర్మల ఫలముఁ బోషకుఁడ నేన
పుత్రుఁడను స్థితియును నేన పుడమియందు
జగతి నాశంబులేని బీజంబు నేన
ప్రళయమును మిత్రుఁడను నేన ప్రభువు నేన
స్వామియును నాశ్రయుండను పార్థ! నేన॥ 18

తపామ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ
అమృతం చైవ మృత్యు శ్చ స దస చ్చాహ మర్జున!

పార్థ! వర్షంబు నేన తాపముఁడ నేన
వర్షమును నిరోధించిన వాఁడ నేన
స్థూల సూక్ష్మాత్మకుండనై క్షోణిఁ బరగి
యమృతమును మృత్యువును నేన యగుచు నుందు॥ 19

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్దివి దేవభోగాన్.

వేదముల నెల్ల నెవ్వారు వేత్తలగుచు
సోమపానంబుఁ జేసియు సువ్రతులయి
పాపములఁ బాసి యజ్ఞముల్ఁ పరగఁ జేసి
స్వర్గమును గోరుచున్నారు జగతియందు
వారు పుణ్యఫలా స్వర్లోక పదవిఁ జెంది
దివ్యభోగాల నన్నిట స్థిరముగాను
అనుభవించుచు నుందురో యనఘ! వినుము॥ 20

తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయాధర్మ మనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే.

అట్టి వారలు స్వర్లోక మనుభవించి
పుణ్యము నశింపఁ బుడమినిఁ బుట్టుచుందు
ఇటుల వేదధర్మము నాశ్రయించినట్టి

విషయములఁ గోరువారలు వివిధగతుల
భువికి దివికిని వచ్చుచుఁ బోవుచుంద్రు॥ 21

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్.

ఇతరమగు దైవచింతల నెపుడు వీడి
చంచలముకాని మనసుతోఁ సరిగనుండి
నన్నె తలఁచును సేవించుచున్నవారి
కుశలముం జూచుచుండుదు కుంతిపుత్ర ! 22

యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మా మేవ కౌంతేయ! యజం త్యవిధిపూర్వకమ్.

అన్యదేవతాభక్తులై యలరి యెవరు
శ్రద్ధతోఁ గూడి పూజలు సల్పుచుంద్రు
వారు మోక్షేచ్ఛ లేనట్టి వారలగుచు
నన్నె పూజించుచున్నారు సన్నుతాంగ ! 23

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ,
న తు మా మభిజానంతి తత్త్వేనాత శ్చ్యవంతి తే.

సర్వయజ్ఞములకు నేన స్వామి నగుదు
అనుభవించెడు వాడ నే నౌదు సుమ్ము
ఎవరు యాదార్థ్యముగ నన్నె నెఱుగ లేరొ
వారు యాగఫలమునుండి జారుచుంద్రు ॥ 24

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్.

దేవతలఁ గొల్చువారలు దేవలోక
ములను, పితృదేవ వర్గముఁ బుడమిఁ గొల్చు
వారలు పితృలోకములను వసుధ భూత
ములను సేవించువారలు భూతలోక
ములను పొందుచునున్నారు పుడమి నన్నె
సేవచేసెడు వారు నన్ జెందుచుంద్రు॥ 25

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.

పత్రమైనను నీరైన ఫలమునైన
పుష్పమైనను భక్తితోఁ బుడమి నెవఁడు
నాకు నొసగునో యద్దాని నధిక ప్రీతి
భక్షణము చేయుచున్నాను పార్థ! వినుము. 26

య త్కరోషి య దశ్నాసి య జ్జుహోషి దదాసి యత్,
య త్తపస్యసి కౌంతేయ! త త్కురుష్వ మదర్పణమ్.

నీ వొనర్చెడి కర్మలు నీవు చేయుఁ
దానములు భుజించెడి పదార్థములు పార్థ!
వాని నన్నింటి సర్వదా భక్తితోడ
నర్పణము నాకుఁ జేయుమో యనఘ! నీవు॥ 27

శుభా శుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః
సన్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి.

అటుల సన్యాసయోగయుక్తాత్ము లెపుడు
సకల మంగళామంగళ సరణిఁ గనుచు

కర్మబంధము లన్నియుఁ గరము వీడి
పొందగల రర్జునా! నన్ను పుడమియందు॥ 28

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాఽప్యహమ్ .

సర్వభూతంబులకు నేను సముడనగుదు
ఇష్టులు నయిష్టులు నాకు నిలను లేరు
ఎవరు భక్తితో నన్ను సేవించుచుంద్రొ
వారియం దేను నాయందు వారు నుందు॥ 29

అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధు రేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః.

మిగుల దుష్టప్రవృత్తితో మెలగుచున్న
వాడె యైనను నన్యదేవతల సేవ
చేయ కెప్పుడు నన్నె భజించుచుండుఁ
వాడు మామకధామంబు వసుధ నొందు॥ 30

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి.

అట్టి పురుషుఁడు ధర్మాత్ముఁ డగుచు మిగుల
శాశ్వతంబైన శాంతిని జగతిఁ బొందు
పార్థ! నాదగు భక్తుండు పరముఁ జెంది
నాశనము పొందఁ డెప్పుడు నయముగాను॥ 31

మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్.

నీచయోనులఁ బుట్టుచు నెగడువారు
స్త్రీలు కోమటుల్ శూద్రులు చిత్తమలర
నన్ను సేవించి గొప్పదా నాదు ధామ
మెపుడు చెందుదు రర్జునా! యుద్ధరణని॥ 32

కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్.

భక్తులై పావనులునైన బ్రాహ్మణులును
అటులె రాజర్షులును గొప్పదైన పదవి
పొందగలరని వేరుగాఁ బుడమి నేను
చెప్పవలయునె సుఖవర్జితములైన
నిత్యమును కాని యీలోక నిరతిఁ బొంది
నన్ను సేవించు మర్జునా! సన్నుతముగ॥ 33

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మా మే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః.

నీవు నాయందు మనసుంచి నిశ్చలముగ
భక్తితోఁ బూజగావించి వందనములు
నాకుఁ జేయుము చేసిన నన్ను నీవు
పొందగలుగుదు వర్జునా! పుడమిపైని॥ 34

రాజవిద్యారాజగుహ్యయోగమనెడి
తొమ్మిదవ యధ్యాయము ముగిసెను.



పదియవ అధ్యాయము

# విభూతి యోగము

భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా.

సుందరుఁడ! ప్రీతితో వినుచున్న నీకు
మంచిచేయంగవలెనని మనసు కలిగి
మఱల యత్యుత్కృష్టమైన యీ మాటలన్ని
చెప్పెదను వాని నాలింపు చిత్త మలర॥ 1

న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః.

ఇంద్రగణములు ఋషులును నెప్పుడు నన్ను
తెలియలే రర్జునా! నేను దేవతలకు
సర్వఋషులకు నుత్పత్తి స్థానమనుచుఁ
దెలియు మెప్పుడు దీనిని ధీర! నీవు॥ 2

యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే.

పరగ పుట్టుక లేనట్టి వాఁడ గాను
ఆదిలేనట్టి వాఁడగా ననఘ జనుల
కెల్ల నీశ్వరుండనుచును నెవ డెఱుంగు
వాఁడు మోహవిదూరుఁడై పాపచయము
నెల్లఁ బాయుచుఁ నుండును నిద్ధరణిని॥ 3

బుద్ధిర్ జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః,
సుఖం దుఃఖం భవో భావో భయం చాభయమేవ చ.

బుద్ధి జ్ఞానము మోహము (బుట్టకుంట
క్షమయు శాంతియు దాంతియు సత్యములును
చావు పుట్టుకల్ సుఖదుఃఖ సంచయములు
భయము లేకుంట భయముతోఁ బరగుచుంట 4

అహింసా సమతా తుష్టి స్తపో దానం యశో౽యశః,
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః.

జీవహింస నొకప్పుడు చేయకుండ
సమత, సంతుష్టి, తపమును, సకలదాన
ముల నొసంగుట కీర్త్యకీర్తులును గూడ
వేరువేరైన గుణములు వివిధగతుల
భూతములకు నావల్లనే పుట్టుచుండు॥ 5

మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః.

మునుపు ఋషిసప్తకంబును మనుచతుష్ట
యంబు మద్గతభావులై యవనియందు
జననమందిరి నావల్ల సవ్యసాచి!
పుట్టె వీరలవల్లనే భూతచయము॥ 6

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః,
సో౽వికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః.

ఈ విభూతియోగంబును నెవడు పుడమిఁ
జక్కఁగాఁ దెలిసికొనునో సవ్యసాచి!

వాఁడు చలియింపనదగుచు ( బరగునట్టి
యోగసిద్ధినిఁ జెందుచు నుండు నెపుడు॥

అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః.

ఎల్లసృష్టికి కారణం బేన సుమ్ము
సరిగ నావల్ల భూతముల్ పరగు చుండె
బుధులు దీనిని దెలియుచుఁ బుడమి పైని
నన్ను సేవించుచున్నారు సన్నుతాంగ! ॥ 8

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్,
కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ.

చిత్త మెప్పుడు నాయందుఁ జేర్చి బుధులు
ప్రాణముల నెల్ల నాయందెఁ పరగనుంచి
ఒండొరుల తెలిసికొనుచు నుర్వి నన్ను
ఎల్ల వేళల నన్ను గీర్తించుచుండి
సంతసము జెందుచున్నారు సవ్యసాచి! 9

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే.

ఇలను నాయందు నాసక్తి యెల్లవేళ
కలిగి, సేవించువారలఁ కనవరతము
ఐక్యమునకు ప్రధానమై యలరునట్టి
జ్ఞాన యోగంబు నొసగెద పూని నేను ॥ 10

తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా.

అట్టివారికి మాత్రమే యనఘ నేను
దయను జూపుట కై కాంతిదత్తమైన
జ్ఞానదీపంబు జూపు చజ్ఞానజన్య
మైన చీకటి బాపుదు నర్జునుండ॥ 11

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్.

పరగనుత్కృష్టమగు పరబ్రహ్మమనుచు
పుడమి గొప్పదౌ యల కాంతిపుంజమనుచు
ఆదిదేవుడ వనుచును నజుఁడవనుచు
విభుఁడవై శాశ్వతుండవై విశ్వమందు 12

ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే.

వెలయుచుందువటంచును వివిధగతుల
వ్యాస నారద దేవల యసితఋషులు
నిన్నుఁ జెప్పుచునున్నారు నీవుకూడ
నాకు నట్టులె చెప్పుచున్నావు కృష్ణ! 13

సర్వ మేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ!
న హి తే భగవన్! వ్యక్తిం విదు ర్దేవా న దానవాః.

ఏది నాకుఁ దెల్పితివో లోకేశ కృష్ణ!
అద్దియంతయు సత్యమే యగును సుమ్ము
దేవ! నీదగు మహిమను దేవతలును
అసురవరులును దెలియలే రాదిపురుష! 14

స్వయ మేవాత్మ నాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ!
భూత భావన! భూతేశ! దేవ దేవ! జగత్పతే!

ప్రాణులను వృద్ధిచేసిన వాడ వీవు
ప్రాణులను నియమించిన వాడ వీవు
దేవతలకెల్ల దేవుడ వీవ సుమ్ము
నీవె యెల్లలోకంబుల నేతవయ్య
నిన్నుఁ దెలియుచునున్నావు నీవ సుమ్ము ॥ 15

వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి.

నీ విభూతులు దివ్యమై నెగడు చుండు
ఏ విభూతులు చేత నీవెల్లలోక
ములను వ్యాపించియుంచువో పుడమియందు
వాని వివరము దెల్పు మపారబలుడ! 16

కథం విద్యా మహం యోగిన్! త్వాం సదా పరిచింతయన్
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవ! న్మయా.

ఈశ్వరా! నిన్ను సర్వదా యేవిధముగ
ధ్యానమును జేసి తెలియంగ నగుదు నేన
ఎట్టి వస్తువు లందున నేవిధముగ
చింత చేయంగ తగుదువు శ్రీనివాస! 17

విస్తరే ణాత్మనో యోగం విభూతిం చ జనార్దన!
భూయః కథయ తృప్తి ర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్.

వేల్ప! నీదగు భూతియు విపులమైన
యోగము న్నాకుఁ దెల్పుము భోగిశయన!
సుధను నోలికెడు తావక సూక్తు లెంత
యాలకించిన తృప్తిలే దనఘ! నాకు 18

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నా స్త్యంతో విస్తరస్య మే.

పార్థ! నాదగు భూతు లపారము లవి
లెక్కచేయుటకు నీవలు చిక్కవిపుడు
అయిన వానిలోఁ గొన్నిటి నర్జునుండ!
వినుము దెల్పెద నీ కవి వీను లలర 19

అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మంత ఏవచ.

అన్ని భూతాలకును నంతరాత్మ నేను
పుడమి భూతము లన్నియుఁ బుట్టుటకును
ఉనికికిని, కారణంబయి యుందు నేన
నాశమొందుటకున్ కారణంబు నేన 20

ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ.

భాస్కరులలోన విష్ణువ న్భాస్కరుండ
రాజ! కాంతులు కలయట్టి రవియు నేన
వాయువులలో మరీచియ న్వాయు వేన
చంద్రుఁడును నేన నక్షత్రచయమునకును 21

వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః
ఇంద్రియాణాం మన శ్చాస్మి భూతానా మస్మి చేతనా.

వేదములలోన మఱి సామవేద మేన
సకలదేవతవర్గ వాసవుడ నేన
ఇంద్రియంబులలో మనస్సేను సుమ్మ
పుడమి ప్రాణిజాలమునకుఁ బుద్ధి నేన 22

రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్
వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్.

పదియు నొకటగు రుద్రుల భవుడ నేను
రాజ! విత్తేశుఁడను యక్ష రాక్షసులకు
అష్టవసువులలో నగ్ని యగుదు నేన
కుధరములలోన మేరువన్ కుధర మేన 23

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిమ్
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః.

అర్జునా! పురోహితులలో నధికుఁడనయి
పరగుచున్నట్టి యల బృహస్పతియు నేన
సాగరము నేన యగుదును సరసులకును
బాహులే యుండ సేనాధిపతులతోను॥ 24

మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః.

ఋషుల నందఱిలో భృగు ఋషియు నేన
వాక్కులన్నిట ప్రణవంపు వాక్కు నేన
అద్రులకు నెల్ల పతియగు హిమాద్రి నేన
యజ్ఞములలోన జపయజ్ఞ మగుదు నేన॥ 25

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః

వృక్షములలోన నశ్వత్థ వృక్ష మేన
ఋషులలో నెల్ల నారద ఋషియు నేన
చిత్రరథుఁడను గంధర్వ శేఖరులకు
కపిలముని నేను సిద్ధసంఘంబునకును॥ 26

ఉచ్చైఃశ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్.

అశ్వములలోని కెల్లను నమృతమందు
పుట్టు నుచ్చైశ్రవంబును పుడమి నేన
దంతులకు నెల్ల నైరావతంబు నేన
మనుజులకు నెల్ల నేనకా మనుజపతిని॥ 27

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్
ప్రజన శ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః.

వజ్రమును నేన యాయుధ ప్రకరమునకు
ధేనువులలోన నల కామధేను నేన
వాసుకియు నేన సర్పాల వర్గమునకు
మానవాళిని పుట్టించు మన్మధుండ॥ 28

అనంత శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్
పితౄణా మర్యమా చాస్మి యమస్సంయమతా మహమ్

నాగములలో ననంతుఁడ న్నాగ మేన
వరుణుఁడను నేన జలదేవ వర్గమునకు
భూప! పితృదేవతల కర్యముండ నేన
అఖిలజనులను దండించు యముఁడ నేన 29

ప్రహ్లాదస్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయ శ్చ పక్షిణామ్

అసురవర్గంబులోన ప్రహ్లాదుఁ డేన
గణికులకు నెల్లకాలముఁ గణికుఁ డేన

అఖిలమృగములలోన సింహంబు నేన
పక్షులకునెల్ల గరుడుఁడన్ పక్షి నేన 30

పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ

శస్త్రధరులలో జనకజాజాని నేన
వాయువును నేన పరిశుభ్రవస్తురాశి
మొసలియును నేన జలజంతుపుంజమునకు
నదులలో నెల్ల జాహ్నవీ నదియు నేన 31

సర్గాణా మాది రంత శ్చ మధ్యం చైవాహ మర్జున!
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్

అర్జునా! సృష్టులకు నెల్ల నాది నేన
అంత్యమును మధ్యమును నేన యర్జునుండ!
విద్యలన్నిట యధ్యాత్మ విద్య నేన
వాదమును చేయువారిలో వాద మేన 32

అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్య చ
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః

అక్షరముల నకారము నగుదు నేన
విగ్రహములలో ద్వంద్వమన్ విగ్రహంబు
నాశమందని కాలము న్నగుదు నేన
నాల్గుముఖములుగల వేల్పు నగుదు నేన 33

మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవ శ్చ భవిష్యతామ్,
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా.

అఖిలలోకంబులను నాశ మైనఁ జేయు
మృత్యుదేవత నే నౌదు మేదినీశ!
పుట్టగలవారి కెప్పుడు పుడమి నేన
కారణం బౌదు, స్త్రీలకు క్షమయుఁ గీర్తి
తెలివి బుద్ధియు ధైర్యంబు ధీర! నేన॥ 34

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్,
మాసానాం మార్గశీర్షోఽహమ్ ఋతూనాం కుసుమాకరః.

సామవేదములో బృహత్సామ మేన
ఛందములలోన గాయత్రి ఛంద నేన
మాసముల మార్గశీర్ష మన్మాస మేన
ఋతువులన్నిట మాధవ ఋతువు నేన॥ 35

ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతా మహమ్.

వంచకములై నవానిలో వసుధ నేను
జూదమై యొప్పుచుందును జూడ పార్థ!
కాంతికలవారియందునఁ గాంతి నేన
జయము నుద్యోగము న్నేన సవ్యసాచి!
బలముకలవారిలోపలఁ బలము నేన॥ 36

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనా మ ప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః.

వల్లవులలోన కృష్ణుఁ డన్వాడ నేను
ఋషులలోనికి వ్యాసుడన్ ఋషియు నేన

పాండవులలోనఁ నే నౌదు ఫల్గుణుండ
కవులలోనికిఁ శుక్రుడ గ్గవియు నేన ॥ 37

దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్,
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్.

దండనము చేయువారల దండ నీతి
నేన యగుదును పార్థివా! నిశ్చయముగ
జయము కోరిన వారికిఁ జయము నేన
గోప్యములలోన మౌనంబుఁ గుంతిపుత్ర!
జ్ఞానవంతుల జ్ఞానంబు నేన యగుదు. 38

య చ్చాపి సర్వభూతానాం బీజం త దహ మర్జున !
న త దస్తి వినా య త్స్యా న్మయా భూతం చరాచరమ్.

సర్వభూతంబులకును బీజంబు నేన
అంతటను నేన యుందునోఁ యర్జునుండ !
జంగమస్థావరంబగు సకల భూత
చయము లేదని తెలియుమో సవ్యసాచి ! 39

నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప !
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా.

నాదు మహాత్మ్యములకు నంతంబు లేదు
వాని విస్తారమును నీకు పార్థివుండ !
సంగ్రహము చేసి చెప్పితి సరిగ దీని
మననముం జేయు మెప్పుడు మాన్యచరిత ! 40

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్.

కాంతియుక్తమై యుత్సాహకలిత మగుచు
సంపదలతోడఁ గూడిన సకలవస్తు
చయమునంతయు నాయంశ సంభవంబు
ననుచుఁ దెలియుము నీవు నో యర్జునుండ! 41

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున!
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్.

పార్థ! హెచ్చుగాఁ దెలియుట వలన నీకు
ఏమి లాభంబు కలదయాఁ యెంచి చూడ
నుర్వియంతట నేను నా యొక్కటైన
యంశచే వ్యాప్తమై యుంటి యర్జునుండ! 42

విభూతియోగ మనెడు పదియవ యధ్యాయము ముగిసెను.



పదునోకండవ అధ్యాయము

# విశ్వరూపసందర్శనయోగము

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్
య త్త్వయోక్తం వచ స్తేన మోహో౽యం విగతో మమ.

నన్ను దయచూచుటకుగాను నాకు నీవు
గొప్పదై గుహ్యమైనదై యొప్పునట్టి
మఱియు నధ్యాత్మసంజ్ఞితం బగుచు వెలయు
నట్టి తావక యుపదేశ మందు కతన
పోయె నాదగు నజ్ఞాన పుంజ మిపుడు

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమలపత్రాక్ష! మాహాత్మ్య మపి చావ్యయమ్.

పుండరీకాక్ష! నీవల్ల భూతసముద
యముల యుత్పత్తి నాశము లధికముగను
వింటి నక్షరమగుచును విపులమైన
నీప్రభావంబు వింటిని నిశ్చలముగ

ఏవ మేత ద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర!
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ!

నీవు చెప్పినదంతయు నిజము సుమ్మ
ఈశ్వరా! నీస్వరూపము నెట్టి దనుచుఁ
దెల్పియుంటివో తాదృశ దివ్యమైన
నీప్రభావంబు వింటిని నిశ్చలముగ

మన్యసే యది త చ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో!
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్.

పరిభవ! తాదృశ దివ్యపరిభావముగల
చక్కనౌ రూపమును జూప సాధ్యమనుచు
నీవు తలచితివేని యో నీరజాక్ష!
శాశ్వతంబైన దానిని సరగ నాకుఁ
జూపు మిప్పుడు చూపరుల్ చోద్యమంద 4

పశ్య మే పార్థ! రూపాణి శతశో౽థ సహస్రశః
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ.

విజయ! దివ్యములై పలువిధములైన
నూఱులై వేలసంఖ్యలై పేరుగన్న
వివిధ కాంతులు గలుగుచు వింతలైన
మామకములైన రూపాల మహిమగనుము 5

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత!

ద్వాదశాదిత్యులుఁ సప్తవాయువులును
అష్టవసువులు నేకాదశాదిబిక్షు
వులును, నశ్వినీదేవతాదులును గూడ
నింతవఱ కీవు చూడని యెన్నొ వింత
లైన రూపములన్ జూడు మర్జునుండ! 6

ఇహైకస్థం జగ త్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్
మమ దేహే గుడాకేశ! య చ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి.

పార్థ! సచరాచరంబులై పరగునట్టి
సర్వలోకంబులకు నేకస్థానమైన

నాదు రూపము జూడుము బోధకలిగి
మఱియు వేనినిఁ జూడంగ మనసు గలిగ
వాని నన్నింటి నిప్పుడే వరుసఁ గనుము 7

నతు మాం శక్యసే ద్రష్టు మనేనైన స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్.

ప్రాకృతములైన నేత్రముల్ వలన నీవు
నన్నుఁ జూడంగఁ జాలవు సన్నుతాంగ!
సరగ నొసగెద దివ్యమౌ చక్షువులను
ఈశ్వరాంశమౌ నాయోగ మిప్పుడు చూడు 8

ఏవ ముక్త్వా తతో రాజన్! మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్.

ఓయి ధృతరాష్ట్ర! శ్రీమహాయోగులకును
ఈశ్వరుండైన శ్రీహరి యిటుల పల్కి
గొప్పదైనట్టి శివరూప మొప్పుగాను
పార్థునకుఁ జూపె జనులు వహ్వా యనంగ 9

అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్,
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్య తాయుధమ్.

అట్టి రూప మనేకము లైన యాన
నములతో, నేత్రములతోడ, నాయుధముల
దివ్యమౌ యాభరణముల దీప్తితోడ
వ్యాప్తమై యుండె నో రాజ! యవని యంత॥ 10

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్.

దివ్యమాల్యాంబరంబుల దీప్తితోడ
దివ్యగంధానులేపన దీప్తితోడ
నంతటను ముఖములు కలదగుచు నొప్పు
అంతమును లేని యద్భుతమైన రూప
మర్జునుఁడు గాంచె నాశ్చర్యమగ్నుఁ డగుచు 11

దివి సూర్యసహస్రస్య భవే ద్యుగపదుత్థితా
యది భా స్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః.

అట్టి దివ్యరూపము యొక్క యధికకాంతి
వేయిభాస్కరు లాకాశమందు నొక్క
సారిగాఁ బ్రకాశించినఁ జక్కనైన
కాంతి యెంతగా నుండునో యంతకాంతి
తో సమానంబుగానుండె వాసిలేక 12

తత్రైకస్థం జగ త్కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా.

పలువిధంబులుగాను నేర్పఱచియుండు
అఖిలలోకములు హరిసంహననమందు
నొంటిగాఁ జేరి యుండుట యుర్వి పైని
యర్జునుఁడు గాంచె నామోద మధికమంది 13

తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత.

అపుడు పార్థుఁడు విస్మయం బంది గగురు
పాటు చెందినవాఁడయి పద్మనాభుఁ
డైన, శ్రీవిశ్వరూపున కధికభక్తి
దండమును పెట్టి పలికె కృతాంజలుఁడయి 14

పశ్యామి దేవాంస్తవ దేవ! దేహే సర్వాం స్తథా భూతవిశేషసంఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్.

దేవ! నీదగు దేహమందెల్ల దేవ
తలను, కమలాసనుండైన ధాత నృషుల
నందఱిం దేవ సర్పాల నాదరముగఁ
జూచుచున్నాను సర్వేశ! చోద్యమంది 15

అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్
నాంతం న మధ్యం న పున స్తవాదిం పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప!

పెక్కుబాహువు లుదరముల్ లెక్కలేని
ముఖములుం గన్నులుం గల మూర్తిఁ జూచి
నాఁడ, నో దేవదేవ! యనంతమగుచు
నలరు విశ్వరూపంబున కాది మధ్య
అంతములు కనజాల నో యనఘ! శౌరి! 16

కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్ పశ్యా
మి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్.

గదయు చక్రకిరీటముల్ కలుగునదియుఁ
గాంతిపుంజము సర్వత్ర కల్గునదియు,
నంతటను ప్రకాశించుచే నప్రమేయ
మైనదియు నయి దీప్తమౌ యగ్నిసూర్య
సదృశమైనదియును, నగు చక్కనైన
నీ స్వరూపంబుఁ జూచితి నీరజాక్ష! 17

త్వ మక్షరం పరమం వేదితవ్యం త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే.

పరమమైనట్టి యల పరబ్రహ్మమనియు,
అన్నిజగములకున్నివు ఆశ్రియుండ
వనియు, నాశంబుజెందని వాఁడ వనియు,
శాశ్వతంబగు ధర్మరక్షకుఁడ వనియు,
ఆదిపురుషుఁడ వనుమను ననెద నేను 18

అనాదిమధ్యాంత మనంతవీర్య మనంతబాహుం శశిసూర్యనేత్రమ్
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వ మిదం తపంతమ్

ఆదిమధ్యాంతములు లేక యపరిమిత బ
లంబుగలవాఁడవైన యో కంబుకంఠ!
లెక్కలేనన్ని బాహువు లెల్ల గలిగి
రేయుఁ బవలును జేయు కం దోయి కలిగి
మండుచున్న యగ్నియు ముఖ మందుఁ గల్గి
యెల్లలోకాలఁ గాంతిఁ దపింపఁ జేయు
చున్నవానిగా నిన్ను నే చూచుచుందు॥ 19

ద్యావాపృథివ్యో రిద మంతరం హి వ్యాప్తం త్వయై కేన దిశ శ్చ సర్వాః,
దృష్ట్వా ఽద్భుతం రూపమిదంతవోగ్రం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్

అక్కజంబైన నీరూప మాకసంబు
నంతరాళము లన్నియు వ్యాప్తమయ్యె।
అన్ని దిక్కుల వ్యాపించు యాదిదేవ!
యచ్చెరువును భయంకర మైన నీదు
రూపముం జూచి మూడగు లోకములును
భయము చెందుచునున్నవి పద్మనాభ! 20

అమీ హి త్వా సురసంఘా విశంతి కేచి ద్భీతాః ప్రాంజలయో గృణంతి,
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః స్తువంతి త్వాంస్తుతిభిః పుష్కలాభిః.

దేవసంఘంబు లెల్ల నీ దివ్యరూప
మందు నివసించుచున్నారు పొందుగాను
వారిలోఁ గొందఱుగా భయపడిన వార
లగుచు, నమ్రులై స్తోత్రము లనవరతము
చేయుచున్నారు, ఋషివరుల్ సిద్ధసంఘ
మెల్ల నధిక మహా స్తోత్రాల నుల్లమలర
నిన్నుఁ బొగడుచు నున్నారు నేర్పుతోడ ॥ 21

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ,
గంధర్వయక్షాసురసిద్ధసంఘా వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే.

అష్టవసువులు సాధ్యులు నశ్విదేవ
తలును, నేకాదశేశ్వరుల్ ద్వాదశార్క
ములును, సప్తవాయువులును, ముంజకేశ !
యక్షరాక్షసగంధర్వు లాదియైన
వార లద్భుత మందిన వార లగుచు
నిన్నె చూచుచునున్నారు సన్నుతాంగ ! 22

రూపంమహత్తేబహువక్త్రనేత్రం మహాబాహో ! బహుబాహూరుపాదమ్,
బహూదరంబహుదంష్ట్రాకరాళందృష్ట్వాలోకాః ప్రవ్యథితాస్తథాహమ్ .

కండ్లు చేతులు పాదముల్ కడుపు లూరు
వులును, పెక్కుముఖంబులు గలిగినట్టి
తావకాకారమును మేము దనర చూచి
వెఱపు చెందుచునున్నాము విశ్వనాథ! 23

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననందీప్త విశాలనేత్రమ్ ,
దృష్ట్వా హి త్వాంప్రవ్యథితాంతరాత్మా ధృతిం నవిందామి శమంచ విష్ణో!

ఆకసంబంటుచున్నదై యధికముగను
ప్రజ్వరిల్లుచునున్నదై పరగునదియు
పెక్కురంగులు కలుగుచు లెక్కలేని
మోములుం గన్నులుం గల ప్రాతమైన
నీదు రూపము చూచిన నాదు మనము
భయముచెందుచు ధైర్యముం బడయలేదు॥ 24

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని,
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస!

ప్రళయకాలాగ్నిసదృశమై ప్రకృతికిని భ
యంకరంబైన కోరల నావరించు
చున్న తావకముఖములు చూచి, దిశల
నెఱుగఁజాలను సుఖమును నెఱుగనోయి!
సాకుఁమో దేవ నాకు ప్రసన్నుఁడవయి॥ 25

అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాస్సర్వే సహైవావనిపాలసంఘైః
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః.
వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రాకరాళాని భయానకాని
కేచి ద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః.

ధరణిపాలసంఘములతో ధార్తరాష్ట్రు
లాదిగాఁగల భీష్ముఁడు నస్మదీయు
లైన యోధులుఁ ద్రోణుఁడు నాదిదేవ!
సూతపుత్రుండు వీరలు వీతచేష్టు 26
లగుచు, భీతినిఁ గొల్పెడు నధిక తీవ్ర
మైన కోరలుగలిగిన యాననముల

యందునున్నారు, వేరొక కొంద ఱిపుడు
చిక్కి నీదగు దంతాల శిరము లన్ని
చూర్ణమైనవై కనబడుచున్న విపుడు 27

యథా నదీనాం బహవో౽ంబువేగా స్సముద్ర మేవాభిముఖా ద్రవంతి
తథా తవామీ నరలోకవీరా విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి,

అధిక వేగంబు గలిగిన నదుల యొక్క
అంబువేరీతి యల సముద్రంబుఁ జేరు
అటులె యీశూరులందఱు నంతటను ప్ర
కాశముంగల, యల తావకాననములఁ
జెందుచున్నారు కేశవా! శీఘ్రముగను 28

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః
తథైవ నాశాయ విశంతి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః.

అధిక వేగము కలవయి యండజములు
మండుచున్నట్టి మంటలో మడియు కొఱకు
నేవిధంబున దూఁకునో యావిధమున
ప్రాణులందఱు నీముఖపంక్తి యందు
దూఁకి నశియించుచున్నారు తోయజాక్ష! 29

లేలిహ్యసే గ్రసమానస్సమంతా ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః
తేజోభి రాపూర్య జగ త్సమగ్రం భాస స్తవోగ్రాః ప్రతపంతి విష్ణో!

అధికముగ మండుచున్న నీయాననముల
సకలజనము మ్రింగుచును నాస్వాద మెలమిఁ
జేయుచున్నావు, భీతినిఁ జేయుచున్న

కాంతులన్నియు నీజగమంత నిండి
వానిని దపింపఁజేయుచుఁ బరగుచుండె 30

ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో నమోఽస్తుతే దేవవర! ప్రసీద
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్.

వందనము నీకుఁ జేసెద వాసుదేవ!
నన్ను దయజూడుమో జగన్నాథ! నీవు
ఇట్టి నీప్రవృత్తిని నేను నెరుగనుగద
యిట్టిరూపము గలుగు నీవెవడవయ్య?
ఆదిరూపుఁడవైన యో యనఘ! నిన్నుఁ
దెలియ వేడుచునున్నాను దెలియఁ జెప్పు 31

కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః.

ఈప్రపంచమంతయును నశింపఁజేయు
ప్రబలకాలరూపుండనై పరగుచుందు
ఉభయసేనలయందున నున్న వారి
నీవు చంపకయుండిన నెవరు వారు
బ్రతుకగలవారు లేరయా ఫల్గుణుండ! 32

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్!

కనుక యుద్ధంబునకు నీవు కడఁగు మిపుడె
రిపుల నోడించి కీర్తి నార్జించుమయ్య
అరులు లేనట్టి రాజ్యంబు ననుభవించు
వీరలందఱు నాచేత విగతజీవు

తైరి పూర్వమే, యర్జునా! యనఘ! యిపుడు
హేతుమాత్రుండ వగుము నీ విందు కొంత 33

ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్
మయాహతాంస్త్వంజహిమా వ్యథిష్ఠాయుధ్యస్వజేతాసిరణేసపత్నాన్

సఖుడ! పూర్వమే నాచేతఁ జంపఁబడిన
ద్రోణభీష్మాదివీరుల దురమునందు
జంపుము, భయము వీడుము జన్యమందు
ఇపుడె రిపులను నీవు జయింపఁగలవు 34

ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణంసగద్గదం భీతభీతః ప్రణమ్య.

అధికముగ వణంకుచునున్న యర్జునుండు
ఆదినారాయణుని మాట లాలకించి
వందనముచేసి యంజలిబద్ధుఁ డగుచు
భయముచెందుచు నమ్రుఁడై పద్మనాభు
తోడ నొక మాట పలికెను తొట్రుపడుచు 35

స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా జగత్ ప్రహృష్యత్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః

అచ్యుతా! నీ వతీతుండ వగుటచేత
నెల్లలోకములును నిన్ను నుల్లమలర
స్తవము చేయుచు నుత్కృష్ట సరణిఁగనెను
దానవులు భీతిఁజెందుచు దశదిశలకు
పరుగులెత్తుచునున్నారు పద్మనాభ!
చేయుచున్నారు వినతులు సిద్ధులెల్ల 36

కస్మాచ్చ తేన నమేరన్! మహాత్మన్! గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే
అనంత! దేవేశ! జగన్నివాస! త్వ మక్షరం సదస త్తత్పరం యత్.

స్రష్టకంటెను నాదికారణుఁడవైన
నిన్ను సర్వ ప్రపంచము సన్నుతింప
కుండునా? దేవ! నీవనంతుండవయ్య
జీవ ప్రకృతులకంటెను శ్రేష్ఠమైన
యేపుగల పరబ్రహ్మస్వరూపి వీవు॥ 37

త్వ మాదిదేవః పురుషః పురాణస్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వ మనంతరూప!.

పుణ్యమూర్తివి ప్రాచీనపూరుషుఁడవు
భూతములకెల్ల నాధార భూత మీవ
విశ్వవేత్తవు వేద్యుండ వీవ సుమ్ము
వ్యాప్తమైయుండె నీచే ప్రపంచమంత॥ 38

వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాంకః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే.

వాయు వగ్నియు యముఁడును, వరుణుఁ డింద్రుఁ
డును, నలువయును, వాని పితయు నైన నీకు
వేయిసారులు దండముల్ పెక్కుమారు
వందనంబులు, మఱియును వందనములు॥ 39

నమః పురస్తా దథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ!
అనంతవీర్యామితవిక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః.

నీకు ముందును వెనుకను నెల్లదిశల
వందనంబులు చేయుదు వాసుదేవ!

అంతటను వ్యాప్తమైయుండి యమితమైన
విక్రమంబును గలయట్టి విశ్వవేత్త
వంపుచే సర్వరూపుండ వగుదు వీవ 40

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హేకృష్ణ! హే యాదవ! హేసఖేతి
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ ప్రణయేన వాపి.

నే నిదివఱకు నో కృష్ణ! నీ ప్రభావ
ములను దెలియక యవివేక మొంది నిన్ను
స్నేహ భావంబు, చేతను చెలుఁడ వనుచు,
యాదవుఁడ వనుచు, పిలిచిన నాదు మాట
లెల్ల క్షమియించి, బ్రోవుమో యీశ్వరుండ 41

యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు
ఏకోఽథవా ప్యచ్యుత తత్సమక్షం తత్క్షామయే త్వామహమప్రమేయమ్.

ఈశ! యప్రమేయుఁడ వని యెఱుగలేక
పరగ నేకాంతమందునఁ బరులయెదుట
భ్రమణశయనాదులందున భ్రాంతిచేత
పలుకు నవమానవాక్యముల్ భావమందుఁ,
దలప కెప్పుడు నాయందు దయను జూపు 42

పితాసి లోకస్య చరాచరస్య త్వ మస్య పూజ్య శ్చ గురు ర్గరీయాన్
నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ

అధికమగు ప్రభావముగల యాదిదేవ!
జంగమస్థావరాత్మక సకలలోక
ములకుఁ దండ్రివి గురుఁడవు పూజనీయుఁ

డవును మూడులోకములందు నివ్వరు నీకు
సాటియగువాఁడు నధికుఁడుకా జగతి లేడు 43

తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్.

శ్రీశ! సాష్టాంగదండముల్ చేతు నీకు
తనయుఁ డొనరించు తప్పులు తండ్రివలెను
సఖుఁడు చేసిన దోషముల్ సఖుఁడు పోలె
భార్య చేసిన తప్పులు భర్తవలెను
నేను జేసిన తప్పులు నీవు మిగుల
రక్షణముఁ జేసి క్షమియించు పక్షివాహ!

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే
త దేవ మే దర్శయ దేవ! రూపం ప్రసీద దేవేశ! జగన్నివాస!.

ఎప్పుడును చూడనట్టి యీ గొప్పరూప
మైన విశ్వరూపంబును నవనిఁ జూచి
అధికమైనట్టి సంతోష మందినాఁడ
అయిన నాదగు చిత్తంబు నధికమైన
భయము చెందుచున్నది పద్మనాభ!
పరగ చూపుము పూర్వరూపంబు నాకు 45

కిరీటినం గదినం చక్రహస్తమిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో! భవ విశ్వమూర్తే!

వేయిభుజములు గలిగియు విశ్వరూప
ధరుఁడవైనట్టి యోస్వామి! హరి! ముకుంద!
గద కిరీట చక్రంబులు గలుగునట్టి

తావకంబగు రూపంబు తనరఁ జూడ
కోరుచుంటివి యద్దాని కోర్కెదీర
నాకుఁ జూపుము వసుదేవనందనుండ 46

మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శిత మాత్మయోగాత్
తేజోమయం విశ్వ మనంత మాద్యంయన్మే త్వదన్యేన నదృష్టపూర్వమ్.

ఆత్మయోగంబు వలన నో యర్జునుండ!
ఆదియును నంతమును లేని దగుచు బరగు
నీవు తక్క నింకొకరిచే నెరుగబడని
గొప్పదై దీప్తమైనదై గోప్యమైన
విశ్వరూపంబుఁ జూపితి నేఁగ నీకు 47

న వేదయజ్ఞాధ్యయనైర్న దానైర్న చ క్రియాభిర్న తపోభి రుగ్రైః
ఏవంరూప శ్శక్య అహం నృలోకే ద్రష్టుంత్వదన్యేన కురుప్రవీర!.

పార్థ! యీదృశ విశ్వరూపంబు నీకు
నొక్కనికిఁ జూపఁదలఁచితి నిక్కమిదియ
వేదయజ్ఞక్రియాదుల వివిధమైన
దానములచేత, తపసుచే బూని నన్నుఁ
జూచుటకు వీలుకాదయా సుంతయేని 48

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ ఙ్మ మేదమ్
వ్య పేతభీః ప్రీతమానాః పున స్త్వం
త దేవ మే రూప మిదం ప్రపశ్య.

భీకరంబగు దాదగు విశ్వరూప
మంతయును జూచి నీవు ననంతమైన

భయము చిత్తవిభ్రాంతియుఁ బరగ విడువు
మర్జునా! నీవు భయ మను నదియు లేక
సంతసించినవాఁడవై సహజమైన
నాదురూపంబుఁ జూడుము మోదమలర ॥ 49

ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః,
ఆశ్వాసయామాస చ భీత మేనం భూత్వా పున స్సౌమ్యవపుర్మహాత్మా.

వాసుదేవుఁడు పార్థుని వైపుజూచి
పైనఁజెప్పిన రీతిగాఁ బలికి, తిరిగి
సహజరూపముఁజూపుచు సాధ్వసమున
నున్నవినతుఁడౌ యర్జుని నూఱడించె ॥ 50

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః.

చక్రధర! కృష్ణ నీదగు సౌమ్యమైన
మానవాకారరూపంబు మహినిఁ జూచి
నాదుచిత్తము స్థిరమయ్యె నవ్వె వచ్చె
వసుధజనులలో జేరిన వాఁడనైతి ॥ 51

సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ
దేవా అ ప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః.

ఈడులేనట్టి నారూప మెవరికైన
దర్శనము చేయ నలవి కాదయ్య నీవు
మాత్రమే చూచినాడవు మన్నుఱేడ!
దీనిఁ గోరుచునుందురు దివిజులెల్ల ॥ 52

నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా.

ఇంద్రతనయుఁడ ! నన్ను నీ వేవిధముగఁ
జూచినాఁడవొ యట్టులఁ జూచుకొనఁగ
వేదముల చేత, తపసుచే, వివిధమైన
దానముల చేత, యజ్ఞాల నైనఁ జూడ
శక్యుఁడనుగాను సర్వదా సవ్యసాచి ! 53

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున !
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప !.

శత్రుతాపనుఁడవగు నో సవ్యసాచి !
విశ్వమంతట వ్యాప్తమౌ విశ్వరూపు
చంచలముకాని భక్తిచే సంతసమునఁ
దెలిసికొనవచ్చు చూడంగ నలనుపడును
పొందవచ్చును వేరుగాఁ బొందరాదు॥ 54

మత్కర్మ కృన్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ !

ఎవఁడు నాకయి సత్కర్మ లిలను జేసి
నేనె యుత్కృష్టగతి యని నెమ్మి నమ్మి
నన్నె బహువిధముల ప్రార్థనంబు చేసి
దారపుత్రాదిసంగంబు దూరముంచి
సర్వభూతములందున సముఁడునగుచు
నుండునో వాఁడు పొందుచు నుండు నన్ను ॥ 55

విశ్వరూపసందర్శనయోగ మనెడి పదునొకండవ
యధ్యాయము ముగిసెను.

# పంద్రెండవ అధ్యాయము

# భక్తి యోగము



ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః.

నిన్నె యారాధనము జేసి, నీదు రూప
మందె యాసక్తి కలిగియు, నలరు వారు
గొప్పవారలొ యింద్రియాగోచరుండ
వైన నిన్ను సేవించువారలె యధికులైరొ?
వీర లిరువురలో యోగవేత్త లెవరు?
వారిఁ దెలియంగఁ జెప్పు మో పద్మనాభ! 1

మ య్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః.

ఎవరు నాయందు మనసుంచి యిద్ధరాన
ననిశముఁ సమాహితచిత్తులౌచు మిగుల
శ్రద్ధతో నాదు ధ్యానంబు సరిగఁ జేతు
రట్టివారలె ప్రియులు నా కర్జునుండ! 2

యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యంచ కూటస్థ మచలం ధ్రువమ్.
సన్నియ మ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తేప్రాప్ను వంతి మా మేవ సర్వభూతహితే రతాః

ఎవ్వ రింద్రియసముదాయ మెల్ల వేళ
లందు నరికట్టి సమబుద్ధి నఖిలప్రాణి

చయమునం దభిమానంబు సరిగఁ జూపి,
నాశరహితముఁ జలియింపనదియు, రూప
రహితమున్, శాశ్వతంబును ప్రకృతియందు
ఉన్నదియు, నంతటను జెందియున్నదియును,
నిర్ణయముఁ జేయ నలవికానిదియు, నట్టి
బ్రహ్మము నుపాసనము జేయు వార లెపుడు
నన్ను బొందుదు రర్జునా సన్నిభులయి ॥ 3, 4

క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తా హిగతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే.

అట్టి బ్రహ్మమం దాసక్తమయిన మనసు
కలుగువారల కయ్యది కష్టమగును,
కాయమం దభిమానంబు కలుగునట్టి
వారలును, హెచ్చుకష్టముం బడకి, కలుగ
నేర దెపుడు పరబ్రహ్మనిష్టసిద్ధి ॥ 5

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే.
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి నచిరా త్పార్థ! మ య్యావేశితచేతసామ్.

నేనె యుత్తమగతి యని నిశ్చయించి,
మహితకర్మలు నాకు సమర్పణంబు
చేసి, నాదు రూపంబును చిత్తమందు
నిలిపి, సర్వదా ధ్యానంబు నియతితోడఁ 6

జేయువారల శీఘ్రాతిశీఘ్రముగను
ప్రళయ మనునట్టి భవసాగరమునుండి
యుద్ధరించెడివాఁడనై యుద్ధరాన
నలరుచుందును ప్రభుఁడనై యర్జునుండ! 7

మ య్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మ య్యేవ అత ఊర్ధ్వం న సంశయః.

మనసు నాయందె యుంచుము మానధనుడ!
బుద్ధి నాయందె నిల్పుము శుద్ధచరిత!
విగ్రహము నాశమందిన పిదప నీవు
నన్నె చెందుచు నున్నావు సన్నుతాంగ!

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ!

చిత్త మెప్పుడు నాయందు స్థిరముగాను
ఉంచుటకు శక్తుడవు కాకయుంటి వేని
నన్ను పొందెడి కోరిక యున్న పార్థ!
చేయు మభ్యాసము నీవు స్థిరుడవగుచు 9

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ
మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి.

అటుల నభ్యాసముం జేయ నరిది యేని
మామకార్థమై యెల్లకర్మలను జేయు
మటులఁ జేసితివేని, యో యర్జునుండ!
కరతలామలకంబు మోక్షంబు నీకు 10

అథైత దప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్.

అంతకును నీ వశక్తుండ వైతి వేని
నన్నె స్థిరమైన మనసుతో నాశ్రయించి
భారమంతయు నాయందె పరగ నిల్పి
కర్మఫలమును విడుము కాంక్షతోడ 11

శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్.

యోగముల కెల్ల నభ్యాసయోగ మధిక
మంతకంటెను జ్ఞానము నధికమగును
దానికంటెను ధ్యానంబు, దానికంటె
కర్మఫలము త్యజించుట ఘనము పార్థ!
త్యాగమునకంటె శాంతియె యధికతమము 12

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ.
సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః.

సర్వభూతంబులందున సముడు నగుచు
వైరమును లేక మిత్రుండై పరగువాడు,
ఓర్పుగలవాడు దయతోడ నుండువాడు,
సముండు నగువాడు సుఖదుఃఖ చయము నందు
నిత్యసంతోషియగువాడు, నిర్మలుండు
ధ్యానపరుడు యతాత్ముండై యలరువాడు

చిత్త మెప్పుడు నాయందేఁ జేర్చువాఁడు,
పైనఁ జెప్పిన గుణములఁ బరగునెవఁడొ
వాఁడు నాకు ప్రియుండయి వసుధ నొప్పు 13, 14

యస్మా న్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః స చ మే ప్రియః.

ఎవనిచే నెల్లజనులకు నెల్లజనుల
వలన నెవనికి, సర్వదా భయము లేదొ
యెవఁడు ప్రీతిచే, భయముచే, నీర్ష్యచేత,
నధికుఁడై యెపుడుండఁడో యట్టివాఁడు
మిగుల నాకు నిష్టుండయి మెలగుచుండు 15

అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః.

ఎవఁ డపేక్షారహితుఁడై యెసగుచుండొ
శక్తిగలిగి పవిత్రుఁడై సాగు నెవఁడొ,
పక్షపాతంబు లేకుండ భయము లేక
కర్మఫలమును వీడిన ఘను డెవండొ
భక్తుఁ డయి నాకు సర్వదా పరగు నెవఁడొ
యట్టివాఁడు నాకిష్టుఁడై యలరుచుండు 16

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః

సంతసమునకు నాశకుఁ బొంతపోక,
దుఃఖమునకును పగకును, దూరుఁ డగుచు,
మంగళామంగళములకుం భయము లేక

భక్తి నాయందుఁ జేయుచు బరగు నెవఁడొ,
వాడె, నాకిష్టుఁ డగుచును వసుధ నొప్పు 17

సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః
తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః.

శత్రుమిత్రులయందున సముఁడు నగుచు,
మానమందున నవమానమందుఁ గూడ,
చలికి నెండకు సుఖదుఃఖములకుఁ గూడ,
సముఁడు నగుచును సంసర్గసరణి విడచి 18
మౌనినై ప్రాప్తమైనట్టి వానితోడ
తుష్టుఁడగుచును నాయందు నిష్ఠగలిగి
వసతిలేకను నిశ్చలస్వాంతుఁ డగుచు
భక్తి నాయందు నుంచుచుఁ బరగు నెవడొ
వాడు నాకిష్టుఁడై యుండు పార్థివుండ! 19

యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః.

నేనె యుత్కృష్టగతియని నెమ్మి నమ్మి
మోక్షమున్నిచ్చు నా వాక్యములను నమ్మి
నేను జెప్పిన క్రమమును నియతి నమ్మి
శ్రద్ధతో నడచుకొనునట్టి జనుఁడు పుడమి
భక్తులందరిలో మేలుబంతి నాకు. 20

భక్తియోగ మనెడు పండ్రెండవ యధ్యాయము ముగిసెను.

పదుమూడవ అధ్యాయము

# క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ,
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ!

ఇందిరారమణ పురుషుం డెట్టివాడు?
క్షేత్రమననేది? యెఱుకయు జ్ఞేయమేది?
క్షేత్రవేత్తయునెవ్వాడు శ్రీనివాస?
ప్రకృతియెట్టిది? వీనినిఁ బరగఁ దెల్పు। 1

ఇదం శరీరం కౌంతేయ! క్షేత్ర మి త్యభిధీయతే,
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః.

క్షేత్రమని యీ శరీరంబుఁ జెప్పఁబడును
ఇట్టిగాత్రముఁ జ్ఞాతయై యెవఁడు కలఁడొ
యట్టివానిని క్షేత్రజ్ఞుఁ డనిరి బుధులు
అర్జునా! దీని దెలియుమో యనఘ! నీవు. 2

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత!
క్షేత్ర క్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ.

రాజ! ఫల్గునా! సర్వక్షేత్రముల నేను
క్షేత్రవేత్తగా నుందును శ్వేతవాహా!
క్షేత్రజీవుల తెలివియు క్షితినినేదా
యద్ది తెలివని తెలియుమో యర్జునుండ! 3

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్
స చ యో యత్ ప్రభావశ్చ త త్సమాసేన మే శృణు.

దేహమెద్దియో యెట్టిదో దీని రూప
మెట్టిదో, యెట్లు పుట్టెనో యిద్ధరిత్రి
జీవుఁ డెట్టివాఁ డేరూపుఁ జెందియుండు
వాని వివరంబుఁ దెల్పెద పార్థ! వినుము॥ 4

ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః.

వీని రూపంబు ఋషులచే వేదములచె
పలువిధంబుల బోధింపఁ బడియె మఱియు
బ్రహ్మసూత్ర వాక్యములచే బాగుగాను
దెల్పబడియున్న దర్జునా దీని వినుము 5

మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవ చ
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః.
ఇచ్ఛా ద్వేషః స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్.

ధరణి మొదలగు పంచభూతములు, బుద్ధి
మాయ, గర్వంబు, వాక్పాదపాయుపాణి
యాదిగాఁ గల కర్మేంద్రియములు, త్వక్చ-
చక్షురాదిగాఁ గలిగిన జ్ఞానపంచ
కంబు, చిత్తంబు నింద్రియ కారణంబు
లైన పంచతన్మాత్రలు నైదుకూడ
దుఃఖసుఖములు ద్వేషంబు దోహదంబు (కోరిక)
ధైర్యమాదిగాఁగల మహదాదిరూప
మైనదే, దేహమంచును ననిరి బుధులు. 7

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః.

తనున్నఁదాఁబొగడుకొనక తనరియుంట
ఆత్మధర్మంబుపైకిఁదాఁ ననకయుంట
హింసచేయక యుండుట హే కిరీటి!
క్షమయు శౌచంబు గురుసేవ కలిగియుంట
స్థైర్య మాత్మనిగ్రహమును దనరియుంట 8

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖదోషానుదర్శనమ్
ఇంద్రియములందు భోగ్యాశ యొసగకుండ
గర్వముం జెందకుండుట కుర్వినెపుడు
చావు పుట్టుకల్ రోగంబు జరయుకూడ
తప్పవని, మనము సర్వదా తలచియుంట. 9

అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు
వసుధ సుతధార వేశ్మాది వలన నెపుడు
గలుగు సుఖదుఃఖములు నావి కావటంచుఁ
దలఁచి విషయములం దాశ దనర విడచి
యిష్టములయం దనిష్టాల నెల్ల వేళ
సమతయైనట్టి మనసుతో సరిగ నుంట। 10

మయి చానన్య యోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్త దేశసేవిత్వ మరతి ర్జనసంసది.

అన్య దేవతారాధన యందు మనసు
లగ్నముం జేయకుండుట, రక్తి విడచి
నేన గతియని నమ్మెచు నియతి తోడ
భక్తి నాయందె చేయుట వనమునందు
వాసియైయుంట మానవవర్గమందు
ప్రీతి లేకుండ నుండుట పేర్మితోడ. 11

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్,
ఏతద్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం య దతోఽన్యథా.

ఆత్మ సుజ్ఞానమందున నధికముగను
నిత్య భావంబు గలుగుట నియతి తోడ
మోక్షముం బొందఁగోరుట మొదలుగాగ
వీని సుజ్ఞానమనిరి కోవిదులు, వీని
కన్యముల్ జ్ఞాన శూన్యంబు లనిరి బుధులు॥ 12

జ్ఞేయం య త్త ప్రవక్ష్యామి యజ్ జ్ఞాత్వాఽమృత మశ్నుతే
అనాదిమ త్పరం బ్రహ్మ న స త్త న్నాస దుచ్యతే

తెలియఁదగినది తెల్పెద, దేనిఁదెలిసి
మోక్షముం బొందుచున్నారొ పుడమి జనులు
దాని బ్రహ్మంబటం చంద్రు, దాని కాది
లేదు, మిగుల గొప్పదియును, కాదు సత్తు,
కా దసత్తని చెప్పుదు రాదిమునులు. 13

సర్వతః పాణిపాదం త త్సర్వతోఽక్షిశిరోముఖమ్
సర్వత శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి.

అట్టిబ్రహ్మంబు జగదాది యైనదగుచు
కాళ్ళఁ జేతులఁ గన్నులఁ గర్ణములను
ఆననంబుల శిరముల నావరించి
సర్వజగమున నుండును సవ్యసాచి! 14

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ.

అట్టి బ్రహ్మంబు సర్వేంద్రియములతోడఁ
గూడియుండియు నింద్రియకూటజన్య
మైన వ్యాపారము న్వీడి యలరుచుండ
ఎల్లజగమును ధరియించి యుద్ధరాన (యుద్ధరణిని)
నున్న, నెందునుం దగులక యుండు గుణము
లం దగిలియుండి, నిర్గుణం బై దనర్చు॥ 15

బహి రంతశ్చ భూతానా మచరం చర మేవ చ,
సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం దూరస్థం చాంతి కే చ తత్.

అట్టి బ్రహ్మంబు ప్రాణుల యంతరాత్మ
లందు వెలుపల సర్వదా యలరుచుండు,
అద్ది స్థావరజంగమం బై తనర్చి
మిగుల సూక్ష్మరూపంబున మెలగుచుండు
కానఁ దెలియగ రాదది జ్ఞానులకును
సవిధమందున నుండు నజ్ఞానులకును
దూరమైయొప్పు, నయ్యది తోయజాక్ష. 16

అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్,
భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ.

బ్రహ్మమెప్పుడు విభజింపఁబడనిదయ్యు
ప్రాణులందున విభజింపఁ బడిన దగుచు
నుండు భూతములను మోయుచుండుసతము
మరల పుట్టించు, గ్రహియించు మానధనుడ! 17

జ్యోతిషా మపి త జ్జ్యోతి స్తమసః పర ముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్.

జ్యోతులను నెల్ల నుత్కృష్టజ్యోతి యదియ
యద్ది యజ్ఞానమునకంటె నావలుండు
జ్ఞానమైనది జ్ఞేయంబు జ్ఞానగమ్య
మైనదై యుండు ప్రాణుల మానసమున 18

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః,
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే.

క్షేత్రమును, జ్ఞానమును జ్ఞేయ పాత్రములను
సూక్ష్మముగ నీకుఁదెల్పితి సూనృతుండ!
పరగ నిద్దానిఁ దెలిసిన భక్తుఁడెపుడు
నాదు నిలయమునౌ మోక్షము నందగలడు. 19

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి,
వికారాంశ్చ గుణాం శ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్.

ప్రకృతియు నాత్మలపురుషుండు ప్రాదినుండి
కలరటంచును దెలియుంగ వలయు నీవు

గుణములు న్వికారంబులు కుంతిపుత్ర!
ప్రకృతిజములంచు నెఱుగుమో పార్థ! యెపుడు॥ 20

కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే,
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే.

ప్రకృతి శారీరసుఖదుఃఖ ప్రభృతులకును
కలుగఁ జేయుట కెప్పుడు కారణంబు
పురుషుఁ డెప్పుడు సుఖదుఃఖపుంజములను
అనుభవించుచునుండునో యర్జునుండ! 21

పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసంగోఽస్య స దసద్యోనిజన్మసు.

ప్రకృతియందున్న పురుషుఁడు ప్రకృతిజన్య
మైన గుణముల సర్వదా యనుభవించు
నట్టి పురుషుని గుణసంగ మర్జునుండ!
పుణ్యపాపాదియోనులఁ బుట్టుటకును
బీజమై యొప్పుచున్నది విజయ వినుము. 22

ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః.

కార్యకారణ వ్యాపార క్రమములందు
ద్రష్టయైనట్టివాడును ధరణినాథ!
నియమముం జేయువాడును నేతయగుచు
భోక్తయుఁ భర్తయైనట్టి పురుషుఁ డెపుడు
దేహమందున నుండును దీప్తితోడ॥ 23

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే.

ప్రకృతి పురుషుల నెవ్వాఁడు బాగుగాను
ఎఱుఁగుచున్నాఁడు యట్టివాఁడిద్ధరాన (డిద్ధరణిని)
గుణములంగూడియుండియుఁ గుంతిపుత్ర!
తిరుగ జన్మమునందఁడు పరముఁబొందు॥ 24

ధ్యానేనాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే.

కొందఱాత్మలో ధ్యానముఁ గొల్పుఁ జేసి
యాత్మవలన నా పరమాత్మ నందుచుంద్రు
అన్యులుఁ జ్ఞానయోగాన సతతిఁగాంత్రు
కర్మయోగానఁ బరమాత్మఁ గాంత్రుపరులు. 25

అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే
తేఽపి చాతితరం త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః.

ఇట్లుకొందఱు పరమాత్మ నెఱుగలేక
యితర గురువుల సేవించి సతమువారి
శిక్షణంబొంది మోక్షముఁ జెంది, తిరుగ
జన్మమందరు ధరలోన సవ్యసాచి! 26

యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్త ద్విద్ధి భరతర్షభ!

పార్థివా! విను సకల ప్రపంచమందు
బుట్టుచుఁ జచ్చుచున్నట్టి భూతచయము

ప్రకృతి పురుషుల సంసర్గ వలన సతము
కలుగుచున్నదటంచును దెలియుమయ్య 27

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి.

సర్వభూతములందున సముఁడునగుచు
నున్న పరమేశు నెవ్వాఁడు సన్నుతముగ
శాశ్వతుండని యెరుగునో జగతియందు
వాఁడు సుజ్ఞానియనుచును పలుకబడును! 28

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్
న హిన స్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్.

అట్టివారెల్ల ప్రాణుల నంతరంగ
మందునున్నట్టి పరమాత్మ నధికుడనుచుఁ
దెలిసికొని, వాని హింసింప వలనుబోక
పొందుచున్నారు మోక్షంబు పుడమియందు॥ 29

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి.

వసుధఁగర్మలు ప్రకృతి సంబంధమైన
గుణముల వలనఁ జేయబడినవిగాను
నెవడు తెలియునో యట్టివాఁ డెడదనున్న
యాత్మ లెస్సగాఁ నెఱుగునో యర్జునుండ! 30

యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా.

వేరు రూపాలుగానుండి వివిధభూత
ములను నాత్మయం దెప్పుడు కలవటంచు,
ఆత్మవలననే సర్వంబు నవతరించు
ననుచు నెవ్వాడు దలచునో యనుదినంబు
వాడు బ్రహ్మస్వరూపుడై పరగుచుండు॥ 31

అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః
శరీరస్థోఽపి కౌంతేయ! న కరోతి న లిప్యతే.

అర్జునా విను పరమాత్మ యాదిలేని
వాడు నాశరహితుఁడునై పరగి సతము
గుణగణములతో నెప్పుడు కూడకుండ
దేహములయందు నుండియుఁ దెలిపిలేక
నధికమైనట్టి కర్మల ననుభవించు
వాడు కర్మలచేసెడు వాడుకాడు 32

యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే
సర్వత్రాఽవస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే.

ఆకసంబంతటను నిండి యలరియున్న
నల్పరూపంబుతోఁ దేని నంటకుండ
నెటులయుండునో యటులె యుద్ధరణిని
నాత్మసర్వదేహంబుల యందునున్న
నంటకుండును కర్మల నర్జునుండ! 33

యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత!

భాను డొక్కఁడె సర్వప్రపంచములను
ఎటుల వెలిగింపఁ జేయునో యటులె పార్థ!
క్షేత్రజుండొక్కఁడై సర్వ గాత్రములను
వెలుగుచున్నట్లు చేయుచు విశ్వమందు. 34

క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాంతి తే పరమ్.

పై నిఁ జెప్పిన రీతిగా బరగునట్టి
ప్రకృతి పురుషులభేదముఁ బ్రాణివర్గ
ములను ప్రకృతిని మోక్షమున్, ముందుగాను
జ్ఞానదృష్టిచే నెవ్వారు కాంచగలరొ
వారు పరమాత్మనెప్పుడు పడయగలరు॥ 35

క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగ మనెడు
13 వ అధ్యాయము ముగిసెను.



## పదునాలుగవ అధ్యాయము

# గుణత్రయవిభాగయోగము



పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్,
యజ్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః.

జ్ఞానములకెల్ల నుత్కృష్ట జ్ఞానమిపుడు
తిరుగ నీకేను దెల్పెద తెల్లముగను
దాని నెఱిఁగిన మునులు యదార్థ మైన
శ్రేష్ట మైనట్టి మోక్షంబు జెందినారు॥ 1

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః,
సర్గేఽపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ.

ఇట్టి జ్ఞానంబుపొందిన యట్టివారు
నాదురూపంబుఁజెందియు మీద బ్రహ్మ
సృష్టికాలాన జన్మంబుఁ జెందఁబోరు
ప్రళయమందున దుఃఖంబు పడయరెపుడు 2

మమ యోనిర్మహద్ బ్రహ్మ తస్మి న్గర్భం దధా మ్యహమ్,
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత !.

అధికమైనట్టి నాదగు నంశమైన
ప్రకృతి, భూతాలసృష్టికిఁ బ్రభవమగును
దానియందునె గర్భంబుఁ దాల్చు సతము
అట్టిగర్భాన ప్రాణులు పుట్టుజగతి॥ 3

సర్వయోనిషు కౌంతేయ ! మూర్తయ స్సంభవంతి యాః,
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా.

అర్జునా! విను మిగుల ర హస్యమిద్ది
సర్వయోనుల నెయ్యవి సంభవంబు
లౌచునున్నవో వానికి నాదియైన
ప్రకృతి తల్లి, నే తండ్రినై పరగుచుందు॥ 4

సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః,
నిబధ్నంతి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్.

సత్త్వ మాదియౌగుణముల సవ్యసాచి!
ప్రకృతియందున జన్మించె ప్రాభవముగ
అవ్యయంబైన దేహిని ననుదినంబు
దేహమందున బాధించు దృఢముగాను ॥ 5

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ !.

మూడుగుణముల యందున ముఖ్యమగుచు
స్వచ్ఛమై రోగరహితమై పరగు గుణము
సత్త్వమయ్యది, స్వప్రకాశంబుకలది
యౌచు, సుఖసంగమున నది యలరుచుండి
బంధన మొనర్చు దేహిని ఫల్గుణుండ ! 6

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్,
త న్నిబధ్నాతి కౌంతేయ! కర్మసంగేన దేహినమ్.

కుంతిపుత్రుండ! యర్జునా! కోర్కెలకును
మూలమై ప్రాప్తవిషయాలు పుట్టుటకును
స్థానమై, యొప్పు గుణము రాజసము, నరుని
బంధన మొనర్చు కర్మ సంపర్కమునను 7

తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్.
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత!.

తమము నజ్ఞానమునఁ బుట్టు ధన్యచరిత
సర్వప్రాణుల మోహసంజనక మగుచు
నద్ది యాలస్యనిద్రల యనవరతము
పురుషు బంధించుచున్న దో పుణ్యచరిత! 8

సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత!,
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత.

సత్వ్యగుణమది సుఖమును జక్క నొసగు
రజము కర్మచే బంధించు రాజముఖ్య!
తమము తెలివిని గప్పుచు దఱచుగాను
మఱపు గలిగించుచుండునో మానధనుడ! 9

రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత!,
రజస్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా.

రజము తమముల మించుచు రాజవర్య!
సత్వమనునది పుట్టెను జగతి యందు
సత్వతమముల మీఱుచు సవ్యసాచి!
రజము పుట్టెను, మిగిలిన రజము సత్వ
ములను ద్రోసి తమము పుట్టె పుణ్యచరిత! 10

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మిత్యుత.

ఎప్పుడీ శరీరంబున నింద్రియంబు
లైన శ్రోత్రాదులందున నధికమైన

జ్ఞానరూపంబు తెలివియుఁ గలుగునంతె
నద్ది సత్వాధికంబని యరయుమయ్య॥ 11

లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమః స్పృహా
రజ స్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ!

పరుల ధనమున కాశించి పరగియుంట
కర్మజాలంబున నాసక్తి కలిగియుంట
శాంతిలేకుంట సామాన్య సరణిఁగనుట
ఇంద్రియంబుల నిగ్రహం బెసగకుండ
యిట్టి గుణముల నధికులై యెవరు కలరొ ?
తెలియుమవ్వారి రాజసాధికులుగాను ॥ 12

అప్రకాశోఽ ప్రవృత్తి శ్చ ప్రమాదో మోహ ఏవ చ,
తమ స్యేతాని జాయంతే వివృద్ధే కురునందన !.

జ్ఞానశూన్యంబు మోహంబు జడత్వము
ననులయం దప్రవృత్తియుఁ బరగనివ్వి
యెచట యభివృద్ధిఁ జెందునో యచట తామ
సంబుకలదని యెఱుగు మో సవ్యసాచి ॥ 13

యదా సత్త్వే ప్రవృద్ధేషు ప్రళయం యాతి దేహభృత్,
త దోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే.

సత్వగుణము హెచ్చినట్టి సమయమందు
దేహి మరణంబుఁ జెందియు దివ్యమైన
బ్రహ్మలోకాది లోకముల్ పరగఁగాంచు
ననుచు దీనినిఁ దెలియు మో యర్జునుండ॥ 14

రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే.

రజము హెచ్చయి నరుఁడు మరణమునొంద
కర్మభూయిష్ట మర్త్య లోకమునఁబుట్టు
తమ మధికమయి నరుడును దర్లి వేని
పుట్టు శునకాది యోనుల బుణ్యచరిత॥ 15

కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్,
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్.

సాత్త్వికంబైన కర్మల సత్త్వగుణ సు
ఖంబగు జ్ఞానఫలమును గల్గుచుండు
రాజసమునకు దుఃఖంబు ప్రాప్తియగును
కలుగు తామస కర్మ కజ్ఞానఫలము. 16

సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ,
ప్రమాదమోహౌ తమసో భవతో௨జ్ఞాన మేవ చ.

సత్త్వగుణమున జ్ఞానంబు జననమయ్యె
రాజసంబున లోభంబు రాజపుట్టె
పుట్టియుండెను తామసమునను మోహ
మాదిగాఁగల గుణము లో యర్జునుండ ! 17

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః.
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః.

సాత్త్వికులు పొందుచున్నారు స్వర్గ మెపుడు
రాజసులు చెందుచున్నారు ప్రాయికముఁగ
మర్త్యలోకంబు, విజయ! తామసులు కూడ
జననమందుచునున్నారు శునకములుగ. 18

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి,
గుణేభ్య శ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి.

ఎవఁడు గుణములే కర్తలం చెలుఁగుచుండు
తాను సాక్షిమాత్రుండని తలఁచుచుండు
వాఁడు నాదగు రూపంబు వసుధయందుఁ
చెందుచున్నాఁడు ఫల్గునా! శీఘ్రముగను॥ 19

గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మ మృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే.

దేహమందునఁ బుట్టిన త్రిగుణములను
దాటి యెవ్వాఁడు వర్తించు ధరణియందు
వాఁడు జననాదికంబుల నీఁడి జగతి
మోక్షమందుచు నున్నాఁడు ముందుగాను 20

కై ర్లింగై స్త్రీన్ గుణా నేతా నతీతో భవతి ప్రభో!
కిమాచారః కథం చైతాం స్త్రీన్గుణా నతివర్తతే.

ఇట్టి త్రిగణములను దాటి నట్టివాని
కేమి గురుతులు గలుగును? నెట్టివర్త
నమున నుండును? దానిని దాటుటకును
మార్గమెయ్యది? తెల్పుమో మారజనక. 21

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాండవ!
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి.

త్రిగుణముల కన్నిటికిని నతీతుఁడైన
వాఁడు ప్రకృతి సంభవములై పరగునట్టి

సత్త్వరజములఁ దమమును శత్రువులుగఁ
దలపడు, నివృత్తులం గూడఁ దలపఁడెపుడు॥ 22

ఉదాసీనవ దాసీనో గుణై ర్యో న విచాల్యతే
గుణా వర్తంత ఇ త్యేవ యోఽవతిష్ఠతి నేంగతే.

గుణములందున గుణకార్య గణమునందు
లక్ష్యమును లేనివాడయి లలినెవండు
పక్షపాతంబు లేకను పరగుచుండు
వాడు చలన మొందకయుండు ఫల్గుణుండ! 23

సమదుఃఖసుఖ స్స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసం స్తుతిః.

ఎవడు సుఖదుఃఖములయందు నిష్టులం ద
నిష్టులందునను, స్తుతియందు, నిందయందు
జాతియందున మృత్తికకా జాతరూప
మందు సమదృష్టినుంచునో యతడు కూడ॥ 24

మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే.

మానమందున నవమాన మందుకూడ
అరుల యందున మిత్రుల యందు నెవఁడు
సముడుగా నుండి పనులన్నిఁ జక్కఁజేయు
వాడు గుణముల నధికుండు వసుధయందు॥ 25

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

ముక్తికై నన్ను నిశ్చల భక్తియోగ
మునను సేవించు నెవ్వాఁడు భువనమందు
వాఁడు గుణముల నధికుఁడై బ్రహ్మభావ
మందుచుండును సర్వదా యర్జునుండ! 26

బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృతస్యాఽవ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాంతికస్య చ.

నేను, నాశరహితుఁడును నిర్వికారు
డునగు పరమాత్మకుఁ నిత్యమును నగుచు
ధర్మమునకును, మోక్షపదంబునకును
నాశ్రయంబైన వాఁడనై యలరుచుందు॥ 27

గుణత్రయవిభాగయోగ మనెడు పదునాల్గవ యధ్యాయము
ముగిసెను.

# పదునైదవ అధ్యాయము

# పురుషోత్తమ ప్రాప్తి యోగము

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్.

బ్రహ్మమూలంబు మనుజప్రపంచమంత
శాఖయై యొప్పు సంసార శాఖి కెప్పుడు
అవ్యయం బది వేదము లాకులగును
దాని నెఱిఁగినవాఁడె వేదార్థవేది. 1

అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయ ప్రవాళాః,
అధ శ్చ మూలా న్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే.

తాదృశంబగు సంసార తరువునకును
జ్ఞానశూన్యంబు లగునట్టి శాఖలెపుడు
త్రిగుణములచేత నెంతయు దీర్పబడుచు
మీఁదు క్రిందైన ముఖముల మెలగుచుండి
రాగమోహాదు లెపుడు మూలంబు లగుచుఁ
బరగు భూతంబు లనియెడు పల్లవముల. 2

న రూప మస్యేహ తథోపలభ్యతే నాంతో నచాది ర్నచ సంప్రతిష్ఠా
అశ్వత్థ మేనం సువిరూఢమూల మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా.

ఇట్టి వృక్షంబునకు రూపమేది లేదు
దీని యాద్యంతస్థితులను దెలియరాదు

బహుదృఢంబైన మొదలుతో బరగునట్టి
దాని వైరాగ్యశస్త్ర ఛేదనము మేలు. 3

తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తంతి భూయః
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ.

అటుల భేదింప నే పరమాత్మవలన
నాది లేనట్టి సంసార మవతరించె
నట్టి దేవుని సేవించ నిహము లేదొ
యట్టి పరమేశు నాశ్రియం బవసరంబు॥ 4

నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వంద్వైర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్

మాన మోహాదుల స్వీడి మమతవిడిచి
దారపుత్రాది సంగంబు దూరముంచి
జ్ఞాన విద్య సమార్జనాసక్తులైన
వార లెప్పుడు మోక్షంబు చేరగలరు 5

న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ.

చంద్రసూర్యులు నగ్నియుఁ జక్కఁగాను
భాసమానంబుగాఁ జేయఁ బరగ లేరొ
యేది పొందియుఁ దిరుగ నీ యిలకు రారొ
యద్దిమామక ధామమం చరయవలయు. 6

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
మనష్షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి

ఆదిలేనట్టి నాదగు నంశమేను
జీవలోకంబు నందున జీవరూప
మగుచు, మాయయందున్నట్టి మానసికము
ఇంద్రియంబుల లాగుచు నెసగుచుంతు 7

శరీరం య దవాప్నోతి య చ్చాప్యుత్క్రామ తీశ్వరః
గృహీ త్వైతాని సంయాతి వాయు ర్గంధా నివాశయాత్.

జీవుఁడు శరీరమందునఁ జేరునపుడు
జీవుఁడు శరీరత్యాగంబుఁ జేయునపుడు
పూలవాసనఁగొని గాలి పోవునట్లు
యింద్రియంబుల గ్రహియించి యెసగుచుంతు. 8

శ్రోత్రం చక్షు స్స్పర్శనం చ రసనం ఘ్రాణమే వ చ
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే.

ఈ దృశంబగు జీవుండు నెలమితోడ
చక్షురాదియౌ జ్ఞానపంచకముగూడి
చిత్తమందున నెపు డధిష్ఠించియున్న
విషయ రూపాదికముల సేవించుచుండు. 9

ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః.

జీవుని శరీరత్యాగంబు స్థితియుఁగూడ
ననుభవంబున గుణయుక్తి నరయలేరు
మూఢులెప్పుడు, జ్ఞాననిరూఢులైన
వారల రయుదు రద్దాని వసుధలోన. 10

యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితమ్
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యం త్యచేతసః.

దేహమందుననున్న యాదివ్యరూపు
నాత్మఁ గనుఁగొనఁగలరు యత్నమున నైన
నాత్మ యెఱుకయులేని మూఢాత్ములెపుడు
యత్నముం జేసియైనను నరయలేరు. 11

య దాదిత్యగతం తేజో జగ ద్భాసయతే ఽఖిలమ్
య చ్చంద్రమసి య చ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకమ్.

సూర్యచంద్రాగ్నిగతమయి చూడ్కికెపుడు
మోదకలనంబుఁ జేయు చనాదియైన
కాంతిమామకరూపంబుగా నెఱుంగ
వలయు సుజ్ఞానులైనట్టి వారలెవుడు. 12

గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః

నేను ధరణిఁ బ్రవేశించి నియతితోడ
భూతముల రక్షఁగావింతుఁ బుడమిపైని
రసమె యాత్మగాఁగల్గు రేరాజునగుచు
సస్యముల పుష్టిగావింతుఁ జక్కగాను. 13

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్.

నేను జఠరాగ్నినగుచును నిశ్చయముగ
దేహముం దాల్చువారల దేహమందు

నాశ్రయించుచు భక్ష్యభోజ్యాదులైన
యన్నముం జీర్ణముం జేతు ననవరతము. 14

సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్ జ్ఞాన మపోహనం చ
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో వేదాంతకృ ద్వేదవి దేవ చాహమ్.

సర్వప్రాణుల హృదయాన సరిగనుండి
తెలివి యెఱుకయు మాంద్యంబుఁ గలుగఁజేసి
వేదవేదాంతముల నే నవేద్యుఁడనయి
పరగుచుందును పుడమిపై బాగుగాను. 15

ద్వావిమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే.

లోకమందున పురుషులు ప్రాకటముగ
నిరువురుంగల రక్షరక్షరు లగుచును
క్షరుడు సర్వభూతాత్ముఁడై బరగుచుండు
అక్షరుడు మూలపురుషుడై యలరుచుండు. 16

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః.

వీర లిరువురికంటెను వేరొకండు
కలఁడు పరమాత్మరూపుఁడై యలరుచుండు
అతఁడె లోకత్రయంబున నధివసించి
రక్షఁగావించునట్టి నారాయణుండు. 17

యస్మా త్క్షర మతీతోఽహ మక్షరా దపి చోత్తమః
అతో ఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః.

క్షరునికంటెను నక్షర పురుషుకంటె
మిగుల నధికుడనగుటచే జగతిలోన
వేదమందున ప్రఖ్యాతి వివిధగతుల
నంది, పురుషోత్తముండనై యలరినాను. 18

యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్
స సర్వ విద్భజతి మాం సర్వభావేన భారత!

ఎవడు మోహాదులన్వీడి యిద్ధరణిని
దేవదేవునిగా నన్ను దెలియునెపుడు
అట్టివాడును సర్వజ్ఞుఁ డగుచునన్ను
చిత్తమందున భావించి చేరగలడు. 19

ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ!
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత!

అర్జునా! యిది మిగుల రహస్యమైన
శాస్త్రము నీకుఁదెల్పితిఁ జక్కగాను
దీనిఁదెలిసిన ప్రాజ్ఞుఁడు స్థిరముగాను
కర్మలను జేయుచుండును జ్ఞానియగుచు. 20

పురుషోత్తమప్రాప్తి యోగమనెడు పదునైదవ యధ్యాయము
ముగిసెను.

---

# పదునాఱవ అధ్యాయము

# దైవాసురసంపద్విభాగయోగము

అభయం సత్త్వసంశుద్ధిర్ జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్.

వెరవు లేక మనశ్శుద్ధి బరగుచుంట
జానయోగంబునందుట దానియగుట
వెలుపలన్ గల్గు నింద్రియముల వణచుట
యజ్ఞమధ్యయనతపంబు లార్జవంబు. 1

అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్
దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్

ఇతరులకు పీడఁ జేయక సతతముంట
సత్యమక్రోధ దానంబు శాంతిఁ గనుట
అన్యదోషంబు లెప్పుడు నరయకుంట
భూతదయయుంట చాపల్య ముండకుంట
మార్దవము గల్గి లోలత మానుటయును. 2

తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత!

క్షమయు ధైర్యంబు శౌచంబు కలిగియుంట
ప్రతిభయుండుట ద్రోహముఁ బడయకుంట
గర్వమున్నేలక యుండుట గాగనివ్వి
ఫల్గునా! దేవ వంశంబు వారికుండు. 3

దంభో దర్పోఽతిమాన శ్చ క్రోధః పారుష్య మేవ చ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్.

దంభముఁ గర్వమెప్పుడు దనరియుంట
క్రోధపారుష్యములతోడ కూడియుంట
జ్ఞానశూన్యంబు మానంబు కలిగియుంట
యాసురంబులై యగునివి యర్జునుండ! 4

దైవీ సంప ద్విమోక్షాయ నిబంధాయాఽసురీ మతా
మా శుచ స్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ!

దేవవంశానఁబుట్టిన ధీరులెపుడు
మోక్షముఁ గాంతు) నీకును మోక్షమబ్బు
అర్జునా! రాక్షసాంశంబు నందుజాత
మైనవారలై సంసార మందునుంద్రు. 5

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు.

ప్రాణులకునుండు దేవాంశ రాక్షసాంశ
ములును జన్మంబులవి రెండు మున్నునీకుఁ
దెలియఁజెప్పితి దేవాంశ తెల్లముగను
ఆసురాంశంబుఁ దెల్పెద నవఘ! వినుము. 6

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః
న శౌచం నాపి చాఽచారో న సత్యం తేషు విద్యతే.

అసురభావంబు గల్గిన యట్టిజనులు
భక్తి ధర్మప్రవృత్తి నివృత్తిఁగూడఁ

తెలియఁజాలరు శౌచంబుఁ దెల్లముగను
సత్త్వమాచారమును గూడ సరిగఁగనరు. 7

అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్
అపరస్పరసంభూతం కి మన్య త్కామహైతుకమ్.

జగము సర్వంబు లేదని చాటుచుంద్రు
స్థితియు దీనికి లేదని తెల్పుచుండ్రు
ప్రభువు దీనికి లేదని పల్కుచుంద్రు
కామమే దీని కెప్పుడు కారణంబు
మిధున మెప్పుడు దీనికిఁ బధమటంచు
నసుర జనులును పల్కుదు రంధులగుచు. 8

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః.

ఇట్టి యెఱుకయుఁ బొందిన యట్టివారు
అల్పబుద్ధులు నష్టాత్మ లగుచునుండి
యుగ్రకర్మలఁ జేయుచు నోర్మిలేక
లోకనాశంబుఁ జూతురు ప్రకటముగ. 9

కామ మా శ్రిత్య దుష్పూరం దంభ మాన మదాన్వితాః
మోహా ద్గృహీత్వా ఽ సద్గ్రాహాన్ ప్రవర్తంతే ఽ శుచివ్రతాః.

అధిక వాంఛల నెప్పుడు నాశ్రయించి
దంభమాన మదాత్ములై దనరుచుండి
జ్ఞాన శూన్యత్వమున నసద్జ్ఞానులగుచు
శుచియులేక ప్రవర్తించుచుందురెపుడు. 10

చింతా మపరిమేయాం చ ప్రళయాంతా ముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః

మరణమే యంతమగుచును బరగునట్టి
యపరిమితమైన చింతను నాశ్రయించి
కామభోగంబులే యధికంబులనుచు
నమ్మి వర్తించెదరు గొంద ఱిమ్ముగాను. 11

ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః
ఈహంతే కామభోగార్థ మన్యాయే నార్థసంచయాన్.

ఆశయనునట్టి పాశబద్ధాత్ములగుచు
కామక్రోధాదులెవ్వడు కాంక్షులగుచు
కామభోగార్థ మన్యాయ గాములగుచు
ద్రవ్యమార్జనపరులౌచుఁ దనరుచుంద్రు! 12

ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్
ఇద మస్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్.

ఇంత ధనమిపుడు సముపార్జించినాను
వచ్చుకాలాన మఱికొంత హెచ్చుగాను
కాంచనము వోగుసేతును వాంఛదీర
అనుచు దలఁచును మానవు డవనిలోన. 13

అసౌ మయా హతః శత్రు ర్హనిష్యే చాపరా నపి
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ.

శత్రువులు వీరు నాచేత సమసి రిపుడు
ఇతర రిపులను నే సంహరింపఁగలను

బలము కలవాడ ప్రభువనై పరగుచుందు
భోగవంతుండ సిద్ధుండ పుడమి నెపుడు. 14

ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః.

ధనము కలవాడ మఱియు నే ధార్మికుండ
అవని నా సాటియైన వాడెవడు లేడు
జన్నముం జేయువాడను సంతసించు
వాడనగుచును బరగుదు వసుధలోన. 15

అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ.

అనుచుఁ దలఁచెడి మానవు లవనిలోన
చిత్త వైకల్య మెప్పుడు చెందియుండి
మోహపాశాలఁ జిక్కుచు ముక్తి లేక
ఘోరనరకాన బడుదు రవారణముగ. 16

ఆత్మసంభావితాః స్తబ్ధా ధన మాన మదాన్వితాః
యజంతే నామయజ్ఞైస్తే దంభేనాఽవిధిపూర్వకమ్.

ఆత్మనుతిఁ జేసికొనుచును నలరుచుండి
ధనము మానంబు ముదముతో దనరుచుండి
శాస్త్రసమ్మతముంగాని సవనములను
జేయుచుందురు దుష్టులై చిత్తమలర. 17

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మా మాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః.

నేను గొప్పవాడ నిల నాతొ సాటిలే
రనుచు గర్వమంది యాదిపురుషు
లైన నన్నుఁ దెలియ కంధులై దోషము
లెంచు చుందు రెపుడు హీనగుణులు. 18

తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు.

నాకు శత్రువులగుచును నలరుచుండి
క్రూరులగుచును నశుభులై పేరులేక
తనరుచుండెడి మానవాధముల నెల్ల
నసురయోనుల జనియించు నట్లుచేతు. 19

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని
మా మప్రాప్యైవ కౌంతేయ! తతో యాం త్యధమాం గతిమ్.

అట్టి నీచపు జన్మము నందువారు
జన్మజన్మంబులందు నీచాతి నీచ
మైన పుట్టుక లందుచు నధములగుచు
నుందు రేకాని వారు నన్ జెందలేరు. 20

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధస్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్.

కామరోషంబు లోభంబు గాగనివ్వి
మూడు నరకంబునకు ద్వారములుగ నెంచు
మర్జునా! యివ్వి నాశ మగుట కెపుడు
హేతువులటంచు వీని త్యజింపవలయు. 21

ఏతైర్విముక్తః కౌంతేయ! తమోద్వారై స్త్రిభి ర్నరః
ఆచరా త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్.

కుంతి పుత్రుండ! పైమూటి పొంతబోక
యుండు నాతఁడు మిక్కిలి యోర్మిగలిగి
తనకు వృద్ధి కరంబైన పనుల జేసి
ముక్తి గాంచును సంసార రక్తి విడచి. 2

య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న న సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్.

వదలి శాస్త్ర నియమమును వసుధ నెవడు
సంచరించును స్వేచ్ఛానుసారముగను
వాడు సిద్ధిని పొందడు పరముకూడ
పొందనేరడు సుఖమును బొందలేడు. 2

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మహార్హసి.

శాస్త్రము ప్రమాణమనుచును
శాస్త్రమ్మును నమ్మినీవు చక్కగ నెప్పుడున్
శాస్త్రవిరుద్ధము జేయక
శాస్త్రోక్తము లైన పనులు సల్పుము పార్థా!

దైవాసుర సంపద్విభాగయోగ మనెడు
పదునారవ యధ్యాయము ముగిసెను.

## పదునేడవ యధ్యాయము

# శ్రద్ధాత్రయవిభాగయోగము

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాఽన్వితాః
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వ మాహో రజస్తమః.

శాస్త్ర విధిని విడచి చక్కఁగా నెవ్వరు
శ్రద్ధతోడఁ బూజ సల్పుచుందు
వారి స్థితినిఁదెల్పు వారిజలోచనా!
సత్త్వరజములందు సరిగనిపుడు॥ 1

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు.

అర్జునా! మూఁడు విధముల నగుచుఁ బరగు
శ్రద్ధయనునది సాత్త్విక రాజసమని
తామసంబని, గుణములఁ దనరియుండు
వాని వినిపించెదను విను వీనులలర. 2

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః,

భారతా! సర్వప్రాణుల వారి వారి
యాత్మ కనురూపముగ శ్రద్ధ యలరుచుండు
శ్రద్ధయేసుమ్మ పురుషుండు సర్వజగతి
పూర్వ భవమున నేశ్రద్ధఁ బొడమినదియొ
అట్టిశ్రద్ధయె యాజన్మ మందుఁ గలుగు. 3

యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః.

స్వర్గవాసులఁ బూజింతురు సత్త్వగుణులు
రాజసులు పూజగావింతురు రాక్షసులను
తామసులు పూజగావింతురు భూమినెపుడు
ప్రేత భూతగణంబులఁ బ్రీతితోడ. 4

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః.
కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్.

దంభమున నహంకారాన దనరనుండి
కామరాగ బలంబులు గలిగియుండి
శాస్త్ర వైరుధ్య తపమును సల్పుచుండి
గాత్రమందున్న యింద్రియ గణమునెల్ల 5
సర్వభూతంబులకుఁ గర్మ సాక్షినగుచు
నున్న ననుఁగూడ శుష్కింప మిన్నలగుచుఁ
జేయుచున్నార లెవ్వారు చిత్తమలర
నసురులుగ వారి నెఱుగుమో యర్జునుండ! 6

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు.

ప్రాణిసంతతి కెల్లడఁ బ్రియకముగ
మూడు విధముల యాహార మొప్పియుండు
యజ్ఞము తపంబు దానంబు నట్లయుండు
వినుము దెల్పెద త్రైగుణ్య భేదమిపుడు. 7

ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః
రస్యా స్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః.

నేతితోఁగూడు నవియును బ్రీతికరము
లై నవియు, రసయుక్తములై నవియును,
నగువస్తువుల్ సాత్త్వికు లైనవారు
ఆయువును సత్త్వబలముల నధికమిచ్చు
నవియుఁ గోరుదు రెప్పుడు మనములందు. 8

కట్వమ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః.

కటువు నామ్లంబుఁ లవణంబు గల్గునవియు,
కార మతిదాహకంబులు కఠినమైన
వియును, నగునట్టి యాహారచయము లెపుడు
కోరుచుందురు రాజసుల్ కుంతిపుత్ర ॥ 9

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్.

వంటచేసియుఁ జల్లారు వంటకంబు
సారమును లేక దుర్గంధ సహితములును
చలిది యన్నంబు నుచ్ఛిష్టచయముఁగూడఁ
గోరుచుందురు తామసగుణులు సతము. 10

అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః.

"శాస్త్రవిధిచేత నియమిత సవనములను
ఫలము కోరకయే చేయ ఫలితముండు"

అనుచు చేసెడి యజ్ఞము లర్జునుండ!
సాత్త్వికములని తెలియుము చక్కగాను 11

అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్.

దంభమునఁ గూడుకొనినదై దనరునట్టి
ఫలము కాంక్షించి గొప్పకై యిలను సతము
చేయుచున్నట్టి యజ్ఞము ప్రాయికముగ
రాజసమటంచుఁ దెలియుమో రాజముఖ్య ! 12

విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్,
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే.

శాస్త్రవిహితంబుఁగానట్టి సప్తతంతు
వన్నదానంబుఁ జేయని యజ్ఞమెప్పుడు
శ్రద్ధలేకుండఁ జేసెడి సవనములును
మంత్ర దక్షిణ లొసగక తంత్రముగను
సల్పు యజ్ఞంబు, తామస సరణినుండు
ననుచుఁ బల్కిరి యద్దాని నార్యులెప్పుడు. 13

దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే.

దేవవిప్రుల గురువుల ధీనిధులను
పూజఁ జేయుట, శుచి యగుచుఁ బుడమినుంట,
ఆర్జవము బ్రహ్మచర్యాన నలరియుంట,
హింసఁ గావింపకుండుట హే కిరీటి!
దలఁచు మిద్దాని శారీర తపమటంచు. 14

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.

పరులకును బాధసేయక పరముఁగోరి
ప్రియము హితమైన వాక్యంబు ప్రీతితోడఁ
బల్కుటయు వేదమెప్పుడు పఠనచేయు
టనఁగ వాగ్రూప తపమయ్యె నర్జునుండ ! 15

మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే.

చిత్త నైర్మల్య మెప్పుడు చెందియుంట,
మంచితనమును గల్గియు మౌనియగుట,
చిత్త స్థైర్యంబు కపటంబు చెందకుంట
మానసికమైన తపమిది మాన్యచరిత ! 16

శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే

మీద వివరించు మానసికాదులైన
మూడు విధముల తపములు ముఖ్యమగును
ఫలము కోరక శ్రద్ధతోఁ బరగఁ జేయు
తపము సాత్త్విక మనిరి ఓ సవ్యసాచి ! 17

సత్కార మాన పూజార్థం తపో దంభేన చైవ యత్
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్.

పరులచేఁ బూజలెప్పుడు పడయుటకును
గారవంబును దంభమున్ గణన కొఱకుఁ

జేయు తపమది రాజస మయ మటంచు
నార్యులెల్లరు పల్కి రవార్యముగను. 18

మూఢగ్రాహేణాత్మనో య త్పీడయా క్రియతే తపః,
పర స్యోత్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్.

తనకు దుఃఖకరంబౌచు. దనరునట్టి
యితర ప్రాణుల బాధించి యెసగునట్టి
దురాగ్రహాముచేతఁ జేసెడి యధమ తపముఁ
దామసంబని యందురు ధరణిలోన. 19

దాతవ్య మితి య ద్దానం దీయతేఽనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ త ద్దానం సాత్త్వికం స్మృతమ్.

దేశకాల పాత్రములను దెలిసికొనుచుఁ
దిరుగ నుపకారముం గోర నెఱుగనట్టి
వాడు చేసిన దానంబు వసుధయందు
సాత్త్వికంబని యందురు సవ్యసాచి! 20

యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః
దీయతే చపరిక్లిష్టం త ద్దానం రాజసం స్మృతమ్.

ఫలమపేక్షించియును ఖేద పడుచుఁ దిరిగి
యుపకృతిం గోరుచుం జేయుచుండునట్టి
దాన మయ్యది రాజస దానమనుచు
నిశ్చయించిరి పెద్దలు నిపుణమతులు. 21

అదేశ కాలే య ద్దాన మపాత్రేభ్య శ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్.

కుత్సితంబైన దేశాన కుత్సితంబు
నైన కాలాన పాత్రిస్థఁ డైనకాని
వాని కవమానముం జేసి పూనియొసగు
దానమయ్యది తామస దాన మనిరి॥ 22

ఓం త త్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదా శ్చ యజ్ఞా శ్చ విహితాః పురా.

బ్రహ్మనామంబు త్రివిధమై పరగుచుండు
అద్ది "ఓంతత్స" దనుచును నలరుమంద
దాన బ్రాహ్మణ వేదముల్ దనర యజ్ఞ
ములును నిర్మింపఁబడియెను నియతితోడ.

తస్మా దో మి త్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః
ప్రవర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్.

అట్టి హేతువు చేతను యజ్ఞదాన
తపములందైన క్రియలందు దదనుసార
ముగను బల్కుదు రో మని మొట్టమొదట
బ్రహ్మవాదులు సతతంబు బాగుగాను. 24

త ది త్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపఃక్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః.

ముక్తిఁగోరుచునుండెడు పురుషుఁడెప్డు
తత్ అనెడి బ్రహ్మరూపంబు దలచుచుండి
ఫలముకోరకయేఁజేతు రిలను సతము
యజ్ఞదానతపఃక్రియల్ విజ్ఞులగుచు 25

సద్భావే సాధుభావే చ స దిత్యేతత్ ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే.

సదనెడిపదము శద్భావ సాధుభావ
ములను నుపయోగమగుచుండె నిలను సతము
అందుచే నా పదం బిపు డధికముగను
కర్మలందు నశస్తమై ఘనత జెందె 26

యజ్ఞే తపసి దానే చ స్థితి స్స దితి చోచ్యతే
కర్మ చైవ తదర్థీయం స దిత్యే వాభిధీయతే.

దానమందున యజ్ఞానఁ దపమునందు
నిష్ఠ సత్తని ప్రచురమై నెగడుచుండె
విష్ణుకై చేయునట్టి పవిత్రమైన
కర్మ లన్నియు సత్తుగా గాంచవలయు॥ 27

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్
అస దిత్యుచ్యతే పార్థ! న చ తత్ ప్రేత్య నో ఇహ.

హోమదానతపంబులు భూమియందు
శ్రద్ధలేకుండఁ జేయ నసత్తులగును
అవ్వి యిహలోక పరలోక మందుఁగూడ
సరిగ ఫలమును నీయవు సవ్యసాచి! 28

శ్రద్ధాత్రయ విభాగయోగ మనెడు పదునేడవ
యధ్యాయము ముగిసెను.

# పదునెనిమిదవ యధ్యాయము

# మోక్షసన్న్యాసయోగము

సన్న్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుమ్
త్యాగస్య చ హృషీకేశ! పృథ క్కేశినిషూదన !.

గొప్ప బాహులుకలవాడ కుధరధరుఁడ!
ఇంద్రియంబుల నియమించి యొసగువాఁడ!
కేశి యనువానిఁజంపిన కృష్ణ! నీవు
త్యాగసన్న్యాసములయొక్క తత్త్వమిపుడు
వేరువేరుగఁదెల్పుము వినగనాకు॥ 1

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః,
సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః.

కామ్యకర్మలత్యాగంబు గవులు దాని
యందు రెప్పుడు సన్న్యాస మనుచు భువిని
సర్వకర్మలఫలమును సంత్యజింప
త్యాగమంచును జెప్పుదు రర్జునుండ! 2

త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః
యజ్ఞ దాన తపఃకర్మ న త్యాజ్య మితి చాపరే.

కోవిదులుపల్కుచుందురు కొందఱెపుడు
విడువవలె దుష్టమౌకర్మ పుడమియందు
క్రతుల దాన తపంబుల గల్గు కర్మ
విడువరాదంచుఁ బల్కిరి విబుధు లెపుడు 3

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ!
త్యాగో హి పురుషవ్యాఘ్ర! త్రివిధస్సంప్రకీర్తితః.

త్యాగమందున నాదగు ననుభవంబు
వినుము దెల్పెద యర్జునా! వివరముగను
కర్మమోక్షంబు ఫలమోక్ష కర్తృమోక్ష
మనుచు మూడువిధంబుల నవనిఁ బరగు 4

యజ్ఞ దాన తపఃకర్మ న త్యాజ్యం కార్య మేవ తత్,
యజ్ఞో దానం తప శ్చైవ పావనాని మనీషిణామ్.

యజ్ఞదాన తపఃకర్మ లర్జునుండ!
విడువరాదది చేయంగఁ బుడమిమేలు
యజ్ఞదానతపంబులు విజ్ఞులకును
పావనములంచు దెలియుమో పార్థివుండ! 5

ఏతా న్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యా నీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమమ్.

పూర్వమందునఁ దెల్పిన పుణ్యకర్మ
లందు మమకారఫలముల ముందు విడచి
యవ్వి చేయంగవలయునో యర్జునుండ!
యిద్ది నాదగు మతమంచు నెఱుఁగుమయ్య! 6

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోప పద్యతే
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః.

వేదమందుననున్నట్టి పెక్కులైన
నిత్యనైమిత్తికములయి నెగడునట్టి
కర్మములను త్యజింపఁగఁ గాదుమనకు
అట్లువిడచుట తామస మనిరి బుధులు. 7

దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్.

గాత్రమునకు కష్టంబును గలుగు ననెడి
భీతి నేకర్మవిడచును ఖ్యాతి నెవడు
వాడు రాజసత్యాగంబు పరగఁజేసి
త్యాగఫలమును బొందడు ధరణిలోన॥ 8

కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున!
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః.

ఫలమునం దాశవిడచియు ఫల్గునుండ
నిత్యమైనట్టి కర్మల నెవడు సేయు
నట్టివాని ఫలత్యాగ మధికముగను
సాత్త్వికంబని తెలియుము సవ్యసాచి! 9

న ద్వే ష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః.

సత్త్వగుణముచేఁ గూడిన జనుఁడు పుడమి
నాత్మ నెరుకయుఁగలవాడు అగుచు దెగిన
సంశయాత్మకుఁడై యొప్పి సవ్యసాచి!
యశుభకరమైన కర్మల సశుభ కర్మ
లందు నొకరీతిగానుండు నధికుఁడగుచు॥ 10

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః,
య స్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే.

దేహధారి యెప్పుడు దివ్యమా కర్మల
న్విడువఁజాలఁ డెట్టి వేళయందు

ఎవఁడు కర్మఫలము నిమ్మహి విడచునో
వాఁడు త్యాగియనుచు వసుధనొప్పు ॥ 11

అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్.

కర్మఫలము త్యజింపని నిర్మలుండు
ప్రియము నప్రియముఁ బ్రియా ప్రియము ననెడు
మూఁడువిధముల కర్మంబు వీడకుండు
కర్మఫలము త్యజించిన ఘనుని, నద్ది
వీడు జన్మాంతరంబున విజయ! వినుము ॥ 12

పంచైతాని మహాబాహో! కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్.

ఫల్గునా! సర్వకర్మల ప్రాప్తికొఱకు
సాంఖ్యసిద్ధాంతమందున సరిగఁ జెప్పఁ
బడిన యైదైన హేతువు లవరగ వినుము
వానిఁ దెల్పెద నీకు నే వీనులలర॥ 13

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
వివిధా చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్.

దేహ మింద్రియవర్గంబు దివ్యమైన
పంచవాయువుల్, దైవము ఫల్గుణుండ!
కర్తయగు నహంకారంబు కంబుకంఠ !
పంచమంబైనదగుచును బరగుచుండు ॥ 14

శరీర వాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః.

చిత్త వాక్కాయకర్మల చేత నరుఁడు
న్యాయమైనను నన్యాయ మైనదైన
నెట్టి కర్మంబుచేయునో యిద్ధరణిని
కారణంబది పై పంచకమున కెపుడు॥ 15

తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః.

కర్మకును బైనదెలిపిన కారణములు
ఐదునుండంగ నెట్టివాఁ డనునో తాను
కర్తయని వాఁడుబుద్ధిని వర్తకుండు
అట్టి యజ్ఞాని తత్వము నరయలేఁడు॥ 16

యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే,
హత్వాఽపి స ఇమాన్ లోకా న్న హంతి న నిబధ్యతే

ఎవడహంకారముం జెంద కిద్ధరిత్రి
కర్మనంటక వర్తించి గడుసుజనులు
సంహరించినవాఁడైన నంపువాఁడు
కాడు వానికిఁ జెందదు కర్మఫలము॥ 17

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మ చోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః.

జ్ఞానమును జ్ఞేయమనుచును జ్ఞాతయనచు
త్రివిధమయ్యెను కర్మోపదేశ మిలను
కరణమనియును కర్మంచుఁ గర్తయనుచు
కర్మసంగ్రహమును మూఁడు కరణు లొప్పె. 18

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తా న్యపి.

జ్ఞానమనుచును కర్మంబుఁ గర్తయనుచు
సాంఖ్యశాస్త్రాన సత్వ రజ స్తమో గు
ణము లనుచును మూడువిధముల నడచుజగతి
నట్టి కర్మాదుల న్వీను మర్జునుండ. 19

సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు తద్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్.

చీమ మొదలైన బ్రహ్మాది జీవులందు
స్థావరములందు సరియగు భావముంచి
నాశరహితంబు వేరుకా నట్టిదగుచు
నొక్కటైనట్టి పరమాత్మ నిక్కమముగ
నెవడుచూచునో విమలుఁడై యుద్ధరిత్రి
వాని యెరుకయు సాత్వీక జ్ఞానమగును॥ 20

పృథక్త్వేన తు యద్ జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్.

సర్వభూతంబులందును సమత లేక
భేద భావంబునుంచుచు వేరుగాను
దెలియుచున్నాడో యెవ్వాని స్థిరత లేక
వాని యెరుకయు రాజసజ్ఞానమగును॥ 21

యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహైతుకమ్
అతత్త్వార్థవ దల్పం చ త త్తామస ముదాహృతమ్.

యుక్తిహీనుఁడై తుచ్ఛుఁడై భక్తిలేక
జీవుని శరీరరూపుగా శేషశయుని
దారు పాషాణమూర్తిగాఁ దలఁచె నెవఁడు
వానియెఱుకయు తామసజ్ఞానమగును॥ 22

నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే.

శాస్త్రసమ్మతమైనదై సంగరహిత
మైనదై నిత్యమైనదై యలరునట్టి
ఫలముఁగోరక రాగాదు లెల్లవీడి
చేయు కర్మ సాత్త్వికమని చెప్పఁబడును॥ 23

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః
క్రియతే బహుళాయాసం తద్రాజస ముదాహృతమ్.

కోరికలఁ బొందఁదలచుచుఁ గుమతులగుచు
గర్వులగుచును మిక్కిలి కష్టమిచ్చు
కర్మలను జేయు నెవ్వాఁడు ఘనతకొఱకు
వారుచేసెడి కర్మంబు వసుధయందు
రాజసంబని పల్కుదు రార్యజనులు॥ 24

అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్.
మోహా దారభ్యతే కర్మ యత్తత్తామస ముచ్యతే.

భావికార్యంబు నాశంబు పౌరుషంబు
పీడయును విచారింపక వీడి ప్రజ్ఞ
జ్ఞానమున్ లేక చేసెడి కర్మచయము
తామసంబనిపల్కిరి ధరణిబుధులు॥ 25

ముక్తసంగో ఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే

దారపుత్రాదిసంగంబు దూరముంచి
ధైర్యసంతోషములతోడఁ దనరుచుండి
గర్వమునులేక ప్రాప్తికై నిర్వికారుఁ
డైన యాతఁడు సాత్త్వికు డనగ బరగు॥ 26

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకో ఽశుచిః
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః

ప్రీతి కర్మఫలములయం దాతురుడయి
లుబ్ధుడై జీవహింసకై లోలుఁడగుచు
నశుచియై దుఃఖహర్షంబు లందుచుండు॥
వాడు రాజసుఁడనగను బరగుచుండు॥ 27

అయుక్తః ప్రాకృత స్తబ్ధ శ్శఠో నైకృతికో ఽలసః
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే.

చిత్తమందున నిసుమంత స్థిరత లేక
బుద్ధిహీనుఁడై స్తబ్ధుఁడై పుడమి నెవఁడు
పరుల నవమానముం జేయఁ బరగుచుండు
వాడు తామసుఁడై యొప్పు ఫల్గుణుండ॥ 28

బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ!

సత్వమాదియగుగుణముల సరణిచేత
మూడువిధములగానొప్పు మనుజుబుద్ధి

ధైర్యములను ధనంజయా! తనరవాని
వేరువేరుగఁ దెల్పెద వినుము నీవు॥ 29

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ.

కర్మమార్గంబు మోక్షమార్గంబు బంధ
మోక్షముల్ భయాభయములు పుడమి నెట్టి
జ్ఞానమునఁ గల్గుచున్నవో వానినీవు
సాత్త్వికంబని తెలియుమో సవ్యసాచి! 30

యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్య మేవ చ
అయథావత్ ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ.

చేయతగినదిద్ది చేయరానిది యద్ది
యనెడు తెలివి యెవని కవనియందు
లేదొ వానిబుద్ధి మేదిని రాజస
మైనదగుచు నెఱగు మర్జునుండ! 31

అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసాఽఽవృతా
సర్వార్థాన్ విపరీతాం శ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ

అర్జునా! విను మీబుద్ధి యధికమైన
తపముచే నావృతమయి యధర్మమెపుడు
ధర్మముగను సమస్త పదార్థములను
దలఁచుఁ, బ్రతికూలములనుగా ధరణినట్టి
బుద్ధి తామసమనదగు పూతచరిత! 32

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః
యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్త్వికీ.

ఎవడు చిత్తము, ప్రాణము, లింద్రియములు
యోగబలముచే నరికట్టు త్యాగియగుచు
ఫల్గునా విను మీవును వానిదైన
ధైర్యమెప్పుడు సాత్త్విక ధైర్యమగును॥ 33

యయా తు ధర్మ కామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున!
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ! రాజసీ.

ఫలముఁగోరుచు నెవ్వాడు పార్థ! సతము
ధర్మకామార్థమోక్షముల్ ధరణియందుఁ
దాల్చుచున్నాఁడొ యవ్వాని ధైర్యమెప్డు
రాజసంబని దెలియుమో రాజవర్య! 34

యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ
న విముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ! తామసీ.

దుష్టమహాబుద్ధి కలిగిన దుర్జనుండు
మదము నింద్రియశోకంబు మొదలుగాఁగ
నివ్వి విడువకయుండునో యుద్ధరణిని
వాని ధైర్యంబు తామస మౌను పార్థ! 35

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి.

సుఖము మూఁడు విధంబుల చొప్పుకనుము
దాని విను నీకుఁజెప్పెద వీనులలర
నెట్టి సుఖభోగమందు క్రీడించు నెవడు
ఎట్టి సుఖము దుఃఖమును బోఁగొట్టు నెప్డు. 36

యత్తదగ్రే విష మివ పరిణామే ఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్.

ఎట్టి సుఖమాది విసముగా నిద్ధరిత్రి
నుండి చివరకు నమృతమై యొప్పునట్టి
తనదు చిత్తనైర్మల్యాన దనరు సుఖము
సాత్త్వికంబని తెలియుగు మో సవ్యసాచి! 37

విషయేంద్రియసంయోగా ద్య త్తదగ్రేఽమృతోపమమ్
పరిణామే విష మివ త త్సుఖం రాజసం స్మృతమ్.

ఏ సుఖంబు మొదట విషయేంద్రియముల
వలన నమృతమగు చునుండి వసుధ పిదప
పరిణమించును విసముగా పాండుపుత్ర!
అట్టి సుఖమును రాజస మనిరి బుధులు॥ 38

య దగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్యప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్.

ఆది నంత్యాన నే సుఖం బనుదినంబు
దనకు మోహాకరంబయి దనరుచుండి
పుడమి నిద్రాదివృత్తులఁ బుట్టునట్టి
సుఖము తామసమందురు శుద్ధచరిత! 39

న త దస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం య దేభి స్స్యా త్త్రిభి ర్గుణైః.

ఎట్టి ప్రాణులు మాయచేఁ బుట్టు జగతి
సత్త్వమాదిగుణంబుల సరణికవా
యట్టి ప్రాణులు స్వర్గ మర్త్యాది లోక
ముల వెదుకలేవు ఫల్గునా! పుడమిరేడ॥ 40

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః.

విప్రవరులకు క్షత్రియ విశుల కెపుడు
శాస్త్రనియమిత కర్మలు సరిగ వారి
ప్రకృతిజన్యంబులైన సత్వాదిగుణము
ల వలన, విభజింపఁ బడియె లబ్ధవర్ణ! 41

శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్.

శమము దమమును క్షాంతియు శౌచములు
ఆర్జవంబును జ్ఞానంబు ఆస్తికతయు
ననుభవజ్ఞానమనునవి యర్జునుండ!
బ్రాహ్మణులకుండు నెప్పుడు ప్రథితముగను. 42

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చా ప్యపలాయనమ్
దాన మీశ్వరభావ శ్చ క్షాత్త్రం కర్మ స్వభావజమ్.

యుద్ధమందున పారిపోకుండుటయును
ధైర్యమును పౌరుషంబును దానమాది
గుణములు గలిగియుండుట కుంతిపుత్ర!
క్షత్రసంబంధమైనట్టి కర్మ లివ్వి॥ 43

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్.

భూమిదున్నుట గోవుల పోషణంబు
వర్తకంబును ననునివి వైశ్యులకును
ఆత్మజన్యంబులౌ కర్మ లర్జునుండ!
సేవశూద్రుల కర్మంబు శ్వేతవాహ! 44

స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి త చ్ఛృణు.

జనుఁడు స్వీయకర్మలయందు సక్తుఁడగుచు
సిద్ధిఁబొందుచునున్నాఁడు శ్రేష్ఠుఁడగుచు
నెట్లు సిద్ధినిఁ బొందునో యిద్ధరణిని
నద్దిదెల్పెదనీకు నో యనఘ వినుము॥ 45

యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః.

ఎట్టియీశ్వరునివలన నెల్లజగము
పుట్టుచున్నదో, యేపుణ్యపురుషుచేత
వ్యాప్తమైయున్న దెల్లడ నట్టియీశుఁ
గొలిచినవాఁడు సిద్ధినిఁజెందుఁ గుంతిపుత్ర! 46

శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్.

వానికులధర్మ మెంతేని వసుధయందుఁ
దక్కువైనను పరధర్మ మెక్కువైన
స్వీయకులధర్మ మెప్పుడు సేయువాఁడు
పాపముల్ బొందనేరడు పార్థివుండ! 47

సహజం కర్మ కౌంతేయ! సదోష మపి న త్యజేత్
సర్వారంభా హి దోషేణ ధూమే నాగ్ని రి వావృతాః.

కుంతిపుత్రుండ! దోషానఁగూడియున్న
సహజమైనట్టి కర్మముఁ జనదువీడ
అగ్నిపొగకప్పురీతిని ననుదినంబు
అన్నికర్మలదోషంబు నావరించు॥ 48

అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి.

అఖిలలోకంబులందున నాశవిడచి
మనసు స్వాధీనముం జేసికొనుచునుండి
కర్మఫలమును వదలిన ఘనుఁడు సతము
పొందు నైష్కర్మ్యసంసిద్ధి పుడమియందు॥ 49

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌంతేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా.

పార్థ! నైష్కర్మ్యసంసిద్ధి పడసి పిదప
బ్రహ్మమును బొందుమార్గముఁ బరగనీకు
సూక్ష్మముగఁ దెల్పుచున్నాను సూటిగాను
వినుము నాచేత నయ్యది వీనులలర॥ 50

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ.

నిర్మలంబైన బుద్ధిచే నియతుఁడగుచు
స్వాంతమును ధైర్యమున త్రొట వశముచేసి
శబ్దరూపాది విషయాల సరణి విడచి
ద్వేషరాగంబులను వీడి దిట్టయగుచు 51

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః.

జనములేనట్టి స్థలమున సరిగనుండి
మితమునైన యాహారంబు మెసగుచుండి
వాఙ్మనశ్శరీరములను వశముఁ జేసి
ధ్యానయోగానురక్తుఁడై యలరుచుండి. 52

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే.

విషయవాంఛాపరత్వాన విముఖుఁడగుచు
కామమాదియౌ శత్రువర్గంబు వీడి
శాంతుఁడై కావరమువీడు జనుఁడు పుడమి
బ్రహ్మభావంబునుంబొందు పార్థివుండ! 53

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి
స్సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్.

బ్రహ్మనిష్ఠుఁడైన వాఁడు నిర్మలమైన
మనసు గలిగియుండి మానసమున
దుఃఖమొందకుండ దుశ్చేష్టలన్వీడి
సముఁడు నగుచు నాకు సల్పుపూజ॥ 54

భక్త్యా మా మభిజానాతి యావా న్య శ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్

సచ్చిదానందరూపుగా సతము సర్వ
వ్యాపిగానుండు నన్ను నో యర్జునుండ!
తెలియు నెవ్వాఁడు తా దృఢధీయుతుండు
జ్ఞానసంపన్నుఁడై నను గలసియుండు॥ 55

సర్వకర్మా ణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్

నిత్యనైమిత్తికములయి నెగడునట్టి
కర్మలను జేయుచుండియు నిర్మలుఁడయి
పాప్యమాస్థాన మే నంచుఁ బరగఁదలఁచు
వాఁడు పొందును మోక్షంబు వసుధయందు॥ 56

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ.

జ్ఞానయోగంబుచేతను గర్మఫలము
నీవు నాయందెయుంచుచు నేనె, నీకు
గొప్పగతియని నమ్మచుఁ గుంతిపుత్ర!
మనము నాయందు నుంచుమో వినయశీల! 57

మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అధ చే త్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి.

అట్లు నాయందు మనసుంచి యలరితేని
మామకంబైన కృపచేత భూమినెపుడు
ఎల్ల దుఃఖములుం జెంద వెపుడు నిన్ను
అటుల కాదేని నాశంబు నగుదు వీవు॥ 58

యదహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైవ వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి.

గర్వముం జెందుచును నీవు కదనమిపుడు
సేయనని పల్కితేనియు జిష్ణుపుత్రి!
వ్యర్థమైపోవు నయ్యది, ప్రకృతిజన్య
గుణము నీచేతఁ జేయించు రణము నిపుడు 59

స్వభావజేన కౌంతేయ! నిబద్ధ స్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి య న్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్

ప్రకృతిజ గుణములకును లోబడిన నీకు
ఎట్టికర్మను జేయుట కిచ్ఛ లేదొ
యట్టికర్మయు మోహాన నవశుఁడవయి
చేయుచుందువు విజయుడా! చిత్తమలర॥ 60

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.

అఖిల భూతంబులకును నియామకుండు
నగుచు నున్నట్టి యీశుండు నఖిలప్రాణి
మానసములందు నివసించి మాయచేత
జీవసంఘమున్ భ్రమియింపఁ జేయుచుండు॥ 61

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
తత్ ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.

అర్జునా! పైనిఁ జెప్పిన దనుసరించి
సర్వభావాల నీశునే శరణఁబొందు
మీవు వాని కృపవలన నెల్లవేళ
చిత్తశాంతియు మోక్షంబుఁ జెందగలవు. 62

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు.

గుహ్యతరమైన నెఱుకయుఁ గోరినీకుఁ
దెల్పితిని దాని బాగుగాఁ దెలిసికొనుము
చక్కగా యోచనంజేసి సరిగనీవు
ఎట్లు చేయుట యుచితమో యట్లుచేయు. 63

సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్.

నీవు నాకుఁ బ్రియుండవు నిశ్చయముగ
కాన, నీక్షేమ మరయుచు బూని యిపుడు
వేరె చక్కని మాటను విశదముగను
వినుము దెల్పెద నీ కేను వీను లలర. 64

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మా మే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.

పరగ నాయందు మనసుంచి భక్తి సల్పి
నన్నుఁ బూజించు మెప్పుడు నాకు వంద
నములు చేయుము చేసిన నన్ను నీవు
పొందఁగల్గుదు వో యన్న పుడమియందు
సత్యమియ్యది ప్రతిన నే సల్పినాడ॥ 65

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

అన్ని ధర్మంబులన్వీడి యర్జునుండ!
నన్ను శరణనుపొందు మో సన్నుతాంగ!
పాపుదును నేను నీదగు పాపములను
శోకమును జెందకుండు మో శూరవర్య! 66

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
న చాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి.

నీకుఁ దెలియుటకొఱకునై నే నుడివితి
తపము శ్రద్ధయు భక్తియుఁ దనరఁ జేయ
కుండువారికి నీగీత యోర్మి చెప్ప
రా దసూయాపరునకును రాజపుత్ర! 67

య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మామే వైష్య త్యసంశయః.

ఎవరు మిగుల నుత్కృష్టమై యుద్ధరణినిఁ
బరమ గోప్యమై జ్ఞేయమై పరగుగీత

నాదు భక్తుల కెప్పుడు నచ్చినట్లు
చెప్పునో వాడు మోక్షంబుఁ జెందగలడు॥ 68

న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి.

అట్టియుపదేశికంటెను నధికు డొకడు
మనుజులందున నాకును మఱియులేడు
భావికాలానఁ బ్రియుడును వానికంటె
మర్త్యలోకానఁ గలుగడు మాన్యచరిత! 69

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞానయజ్ఞేన తేనాఽహ మిష్ట స్స్యా మితి మే మతిః.

మనల సంవాద రూపమై మాన్యమగుచుఁ
బరగు నీగీత నెవ్వాడు భక్తితోడఁ
బఠనముం జేయు శ్రద్ధతోఁ బాగుగాను
వాడు జ్ఞానయోగంబుచేఁ బడయు నన్ను
ఇద్ది నాదగు నిశ్చయం బిందిపుత్ర! 70

శ్రద్ధావా ననసూయ శ్చ శృణుయా దపి యో నరః
సోఽపి ముక్త శ్శుభా న్లోకా న్ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్.

గీతాశాస్త్రము నెవ్వడు
ప్రీతిగ శ్రద్ధయును గలిగి వేడుక వినునో
యాతడు ముక్తిని, జెందును
పాతకములు నంటవతని పార్థివముఖ్యా! 71

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ! త్వ యైకాగ్రేణ చేతసా
కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్ట స్తే ధనంజయ!

నిశ్చలంబైన మనమున నియతుఁడగుచు
కుంతిపుత్రుండ! యీగీత కూర్మితోడ
వింటివా? మానసంబున నంటునట్లు
పోయెనా యేమి? యజ్ఞాన పుంజమిప్పుడు॥ 72

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ ప్రసాదాన్మయాఽచ్యుత!
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ.

పోయె నాదగు నవివేక పుంజమిప్పుడు
తావకంబైన కృపచేతఁ దనరె యెఱుక
నేను సందేహముక్తిచే నెగడినాను
చేయువాడను నీమాట శ్రీనివాస! 73

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్.

రాజ! యాశ్చర్యపులకాంకురములు గలుగఁ
జేయునట్టిదై వైకుంఠ జిష్ణుపుత్రి
వాదరూపంబునగుచును బరగునట్టి
గీత నేవింటి ధన్యుండ పూతచరిత॥ 74

వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేతద్ గుహ్యతమం పరమ్
యోగం యోగేశ్వరా త్కృష్ణాత్సాక్షా త్కథయతః స్వయమ్.

యోగయోగీశ్వరుండగు భోగిశాయి
తాను జెప్పిన, గొప్పదై తనరునట్టి
శాస్త్రరూపంబు వ్యాసుని సత్కృప నిధి
నేను వినియుంటి ధృతరాష్ట్ర వీనులలర. 75

రాజన్! సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతం
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః

రాజ! యాశ్చర్యకరమౌచు రమ్యమైన
వాసుదేవ ఫల్గునుల సంవాదమిపుడు
నేను దలచియుఁ దలచియు నిశ్చలముగ
సంతసముఁ జెందుచున్నాను స్వాంతమందు॥ 76

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః
విస్మయో మే మహాన్ రాజన్ ! హృష్యామి చ పునఃపునః

చిద్విలాస స్వరూపుఁడౌ శ్రీనివాసు
విశ్వరూపంబుఁ బలుమారు వినుతిఁ జేయ
నాకు నాశ్చర్య మెంతయు నధికమగుచుఁ
బులకలిప్పుడు దేహాన బుట్టుచుండు॥ 77

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.

యోగులకు నీశ్వరుండగు భోగిశాయి
యిషువు దాల్చిన పార్థుండు నెచటనుందు
రచట శ్రీయును విజయంబు నధికముగను
కలుగుచుండును నాకోర్కె కౌరవేంద్ర! 78

మోక్షసన్న్యాసయోగమనెడి పదునెనిమిదవ
యధ్యాయము ముగిసెను

రాధాస్వామి సహాయము.





శ్రీరమానాథకరుణాకటాక్షవీక్షణప్రసాదలబ్ధకవితా విశారదుండును, ఆపస్తంభసూత్రుండును, యజుర్వేదుండును, కాశ్యపగోత్రపవిత్రుండును, నృసింహేశ్వరపౌత్రుండును, చాయన్నేశ్వర పుత్రుండును, మహాలక్ష్మీగర్భశుక్తి ముక్తాఫలుండును, జగన్నాథేశ్వర సోదరుండును, మావుడూరివంశ పయఃపారావార రాకాసుధాకరుండును, ఉభయ భాషాప్రవీణ బిరుదాంకితుండును, నగు సత్యనారాయణ శాస్త్రిచే రచింపఁబడిన "ఆంధ్రీకృత భగవద్గీత" అను గ్రంథము సర్వము సంపూర్ణము.



# ఆంధ్రీకృత గీతామాహాత్మ్యము

ఓ రమేశ! సమర్థుండ పృథ్విలోన
నాయ ప్రారబ్ధకర్మము ననుభవించు
నట్టివానికి నిశ్చలంబైన భక్తి
యెట్లు కల్గును దెల్పవే యించుకంత
యనుచు భూదేవి విష్ణువు నడిగినంత. 1

అవని ప్రారబ్ధకర్మము ననుభవించు
చున్నవాఁడైన నెవ్వాఁడు నెన్నరాని
గోరాశ చే భగవద్గీత లనుదినంబు
నయవిధంబున పారాయణం బొనర్చు
నట్టివాఁ డిల కర్మబంధంబులేక
ముక్తి సుఖములు చెందును బొందఁగలఁడు. 2

గీతలను ధ్యాన మొనరింప పాతకములు
బ్రహ్మహత్యాదులైనను పద్మపత్ర
మున నీరమంటని విధమున నొకప్పు
డైన నంటవు తెలియుమీ యెవ్వనికైన 3

ఊర్విలో భగవద్గీత లుండుచోట
సరిగ పారాయణంబును సలుపుచోట
అల ప్రయాగాది తీర్థము లన్నియుండు
నిది నిజం బని నమ్ముము హృదయమందు. 4

ఉర్విలో భగవద్గీత లుండుచోట
దేవతలు, యోగులు, ఋషులు దివ్యపన్న
గులును, గోపాలురును, నుటి గోపికలును
నారదుం డుద్ధవుండు, విష్ణుద్వారపాల
కులును, శీఘ్రముగ సహాయకు లగుదురట. 5

వినుము భూదేవి గీతార్థమును విచార
ణ మొనరించుచోటను వానిఁ నయవిధమున
చదువుచోటను, చదివించు స్థలమునందు
నేను నిల్తును సతతంబు నిశ్చయముగ 6

ఏను గీతలనే యాశ్రయించి యుందు
గీతలే నాకు నుత్తమ గృహము, గీత
లందుఁ జెప్పిన జ్ఞానము ననుసరించి
యేను ముల్లోకములను పాలించుచుందు. 7.

అర్ధమాత్రాస్వరూపంబు నక్షరంబు
బ్రహ్మరూపంబు నిత్యశాస్త్రంబు సుమ్ము
పరసుఖంబున కుత్తమబ్రహ్మవిద్య
యనుట కేమాత్రమును సందియంబు లేదు. 8

సచ్చిదానందరూపుడున్ సర్వగుణుఁడు.
నైన శ్రీకృష్ణపరమాత్మ డర్జునునకు
నిట్టి గీతల నుపదేశ మెలమిఁ జేసె
నిప్పె వేదత్రయంబగు నిదియె రూప
మగు పరానందమునకు, నీ యవనిజనుల
కిదియె తత్త్వార్థజ్ఞానము వృద్ధిఁజేయు. 9

అనుదినంబును నిశ్చలమైనమతిని
అవని పదునెనిమిదగు నధ్యాయములను
జప మొనర్చిన యతఁడు నిస్సంశయముగ
బ్రహ్మవేత్తయయి పరమపదము నందు. 10

అనుదినంబును పూర్తి పారాయణంబు
సలుపఁజాలని యాతఁడు సగముఁ జదువ
వచ్చు, నటు లొనర్చినవాడు బడయు ధేను
దానపుణ్యంబునైనను తథ్యమిదియ. 11

సరిగ మూడవభాగమున్ జదువువాఁడు
బడయఁగలఁడు గంగాస్నాన ఫలము, మఱియు
జపము నాలవభాగము సలుపు నతఁడు
సోమయాగఫలంబును జూరగొనును. 12

అవని నిత్యము నొక్కయధ్యాయమేని
భక్తితోఁ జదువు నతఁడు ప్రమథులందు
రుద్రలోకంబునకుఁ బోయి రూఢినచట
వారితోఁ గూడి చిరకాలవాసముండు. 13
ఒక్క యధ్యాయమందున నోర్మితోడ
నాలుగవభాగమైనను నయముగాను
జపము నిత్యము సేయు నా జనుఁడు మనుజుఁ
డగుచు జన్మించు నొక్కమన్వంతరంబు. 14
పదియుగాని యేడైనను నైదుగాని
నాలుగైనను మూడైన నయముతోడ
రెండుగాని యొకటియైన లేక శ్లోక
మందు సగమైన నిత్యమే మానవుండు
జప మొనర్చునో యాతఁడు చంద్రలోక
మున దశసహస్రవత్సరములు వసించు
గీతలు జప మొనర్చుచు మృతిని జెందు
నతఁడు దేవత్వమును బొందు ననుట నిజము. 15, 16
గీతల నెవండు సర్వదా భూతలమున
జపము సేయునో యతఁడు మోక్షంబు నొందు
మరణకాలమునందైన స్మరణఁజేయు
మానవుం డొందు నుత్తమమైనగతిని. 17
ఘోరపాపాత్ముఁడైనను గోరి గీత
లఁ గల యర్థము వినుటయం దాశగలుగు
నతఁడు వైకుంఠమున కేగి యచట విష్ణు
గూడి యానంద మొందును గోర్కెదీర. 18

నిత్యనైమిత్తికంబుల నెనరుతోడఁ
జేసికొనుచు గీతార్థము చిత్తమందు
ధ్యానమొనరించు నాతఁడు ధన్యజీవి
యగుచు జీవితాంతంబున నధికమైన
పరమపదమును బొందు నవారితముగ. 19

గీతలను నాశ్రయించి నిర్ధూతకలుషు
లగుచు, పేరును లోకమునందుఁ బడసి
జనకుఁ డాదిగ పెక్కురు చక్రివర్తు
లందినారలు మోక్షము ముందు గాను. 20

నయముతో గీత పారాయణమును జేసి
సరిగ దాని మాహాత్మ్యముఁ జదువనట్టి
వాని పారాయణంబది వ్యర్థమగుచు
శ్రమయె మాత్రము మిగులు నీ జగతిలోన. 21

ఇట్టి మాహాత్మ్యమును వీడ కెవరు సతము
గీతలఁ జదువుచుందురో భూతలమున
తత్ఫలం బొంది వారలు తథ్యముగను
మోక్షమునుగూడ ననుభవ మొందుచుంద్రు. 22

శ్రీవరాహపురాణానఁ జెప్పినట్టి
యిట్టి మాహాత్మ్యమును జెప్పి తిపుడు మీకు
దీనిఁ బారాయణముఁజేయు ధీరు లెపుడు
మోక్షమును జెందుచున్నారు పుడమియందు. 23

శ్రీ గీతామాహాత్మ్యము సంపూర్ణము

శ్రీ కృష్ణ పరబ్రహ్మార్పణమస్తు !

సర్వము సంపూర్ణము



R. S.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 17 | జ్ఞాతుల | జ్ఞాతులు |
| 9 | 17 | నిద్ధరాన | నిద్ధరణిని |
| 14 | 11 | పార్థ! | కృష్ణ! (అర్జునుడు) |
| 18 | 17 | సుఖిదుఃఖ | సుఖదుఃఖ |
| 25 | 6 | నిద్ధరాన | నిద్ధరణిని |
| 35 | 4 | ఁజిన్న | ఁచిన్న |
| 39 | 10 | కర్త్మమం | కర్త్మముం |
| 40 | 19 | యిద్ధరాన | యిద్ధరణిని |
| 40 | 20 | కాదు | కాడు |
| 43 | 14 | మ | మం |
| 59 | 13 | ష్రేల్చ | వ్రేల్చ |
| 61 | 5 | మ | సు |
| 62 | 12 | మును | మునునీవు |
| 64 | 9 | భిన్న | ఛిన్న |
| 65 | 17 | నిద్ధరాన | నిద్ధరణిని |
| 70 | 8 | జ్ఞానము | తెలివియు |
| 70 | 15 | ము | యు |
| 76 | 3 | నరునా! | నర్జునా! |
| 76 | 11 | పడుచుండె | జెప్పఁబడుచుండె |
| 87 | 20 | ఈవు | నీవు |
| 94 | 17 | లమ్వర | లంమ్వర |
| 95 | 5 | ములచె | ములన |
| 96 | 3 | అర్జునా! | అర్జున! |

2:

| | | | |
|---|---|---|---|
| 127 | 9 | కునునంత | కున్నంత |
| 159 | 16 | ఘార | దార |
| 161 | 3 | ఆసనం | ఆననం |
| 162 | 10 | ముకంటె | మునకంటె |
| 167 | 6 | చేయుచు | చేయును |
| 169 | 7 | గుణముల | గుణములు |
| 169 | 10 | బాధించు | బంధించు |
| 170 | 9 | సత్య | సత్వ |
| 171 | 8 | కుండ | కుంట |
| 173 | 18 | మార్గరయెయ్యది | మార్గమెయ్యది |
| 182 | 3 | వెరవు | వెరపు |
| 182 | 4 | జాన | జ్ఞాన |
| 187 | 21 | నాశమగుట | నాశనమగుటః |
| 191 | 7 | నలియు | ననియు |
| 193 | 18 | యోసవ్యసాచి! | ఉదారశీల |
| 195 | 10 | నియతితోడ | పూర్వమందె |
| 196 | 3 | శద్భావ | సద్భావ |
| 201 | 14 | జనులు | జనుల |
| 201 | 16 | కాదు | కాడు |
| 201 | 19 | యనచు | యనుచు |
| 202 | 5 | లనుచును | లనుచు |
| 203 | 15 | నెవ్వాడు | నెవ్వారు |
| 205 | 14 | నెఱకు | నెఱుగు |
| 206 | 7 | నెవ్వాడు | నెవ్వాడు |
| 208 | 9 | శౌచములు | శౌచములను |